# సాహిత్య చిత్రములు

[ కథల సంపుటి ]

రచయిత

టేకుమళ్ల కామేశ్వరరావు, B. A., B. Ed.,

Deputy Inspector of Schools.

పబ్లిషర్సు :

ది మోడరన్ పబ్లిషర్సు - తెనాలి.

# * మా సంసారాలు

"ప్రియమైన తమ్ముడికి,

ఈమధ్య నేను చేసిన ఒకపరిశోధనసంగతులు నీకు తెలియ జెయ్యాలని బుద్ధిపుట్టి, దీనివల్ల నీకు కలిగే లాభ మేదేనా వుంటే కలుగుతుందనీ, యీ వుత్తరం, అనేకపనుల్లో తీరికచేసుకుని రాస్తున్నా—

"నేను మొన్నమొన్నటి దాకా అనుకున్నాను, ఆడదాని సంసారం చాలకష్టమనీ, మొగవాడి పనిలాగు సుఖమైనది కాదనీ, మొగ వాడిపని యేముంది—యిష్టం భోంచెయ్యడం, నిద్రపోవడం, ఆఫీసులో కూచోడం, యింటికిరావడం; ఆడదో మరి, పొద్దున్న లేచిన మొదలు రాత్రి పడకొంటింటివరకూ తెరిపిలేకుండా కాలు వంచ డానికేనా వీలులేకుండా, సమయమొచ్చడానికేనా అవకాశం లేకుండా పనిచేస్తూవుండవలసిందే అని. అంచేత యెప్పుడూ మాఆవిడే నాకంటే యెక్కువ కష్టపడుతూంటుంది, పాపం! దాని ఋణం నేను యెప్పటికీ తీర్చుకోలేనని అనుకునేవాణ్ణి. కాని యెప్పుడెప్పుడేనా కొంచెం పరిశీలించి చూసేవాణ్ణి. మా స్త్రీ యెంత సేపూ కష్టించడే కనపడడం, సుఖించిందే సున్నసం, చేసిందే చెయ్యడం అని అనిపించేది. అయినా నాపరిశీలనే తప్పేమో నాలో నేను బుద్ధిచెప్పుకుని వూరుకునేవాణ్ణి. ఈపరిశీలనయినా యెందుకొచ్చేదంటే, ఎప్పుడేనా 'ఈ పుస్తకం చదువు, ఇది యెంతో బాగుంటుంది, ఇది చదువు' అనేవాణ్ణి కాని ఆపుస్తకం యొక్కటి పుటేనా యెప్పుడూ తిప్పివుండడం నేను చూసివుండలేదు. అంతటితో ఆపుస్తకంమీద నాకూ, దానికీ కూడా విరక్తి పుట్టి

* భారతి — ఆగస్టు 1933

పోయేది. 'పోనీ, నువ్వు పుస్తకాలు చదవక్కర్లేదులే. ఇంటికి తెప్పిస్తూన్న ఆంధ్రపత్రిక చదువు, చాలు. నాకు అంతకంటే నువ్వు మరేమీ ఉపకారం చెయ్యక్కర్లేదు. అసలు నువ్వుకూడా చదవడానికనే నేను తెలుగుపత్రిక తెప్పిస్తున్నాను' అని అనేక సార్లు చెప్పేను. కాని ఆ పత్రికేనా అది చదవగా నేను ఎన్నడూ చూసివుండలేదు. 'పాపం! పని తెరిపి లేదు. అంచేత చదవలేదు' అని అనుకునేవాణ్ణి. అంతేకాని మరొకటో సరుగా బద్ధకమనిగాని, పనులు తెమల్చుకోలేదని కాని ఎన్నడూ అనుకోలేదు. ఎప్పుడెప్పుడేనా మీరావదిన కుచ్చెల కథ తీసేది. అదేనా నాలుగు బంతులు చదివేది. అంతటితో సరదా, ఉత్సాహం తగ్గిపోయేవి. ఏకొడుకు వెధవాయి చదవనియ్యకుండా వున్నాడు. ఈ వెధవలతో చదువేమిటి నామొహం మని వాళ్ళని నాలుగు తిట్టి చురుపులు చరిచి ఆపుస్తకం ఒకమూలకి గిరవాటేసేది. ఈ మోస్తరుగా నడిచింది కాలం.

"ఆమధ్య మా మామగారు 'కూతుర్నీ, పిల్లల్నీ ఒకమారు మావూరు పంపించు, నాలుగురోజులుండి వస్తారు' అని వుత్తరం రాసేరు. 'నేను అనేక పనుల్లో వుంటున్నాను. నాకిప్పుడు వీలులేదు" అని చెప్పి వుత్తరం రాసెయ్యాలనుకున్నాను. కాని 'ఇంతకంటే మనకు మరొకప్పుడు మట్టుకు తెరిపి తగలడుతుందా' అని అనిపించీ, ఇంతకీ మరొక కారణముంది కూడా, మరేం లేదు, నేనొక్కడినీ సంసారం చేసిచూస్తే ఎలాగుంటుందో, మాఆవిడ పడ్డ కష్టాలన్నీ నేనూ పడి తెలుసుకుందామని యోచనకలిగీ, ముఖ్యంగా ఈ పరిశోధనకోసమే దాన్ని పుట్టింటికి పంపేసేను. వెళ్ళేటప్పుడు అది పిల్లలనందరినీ తనతో తీసికెళతానంది. కాని నేనే వాళ్ళని విడిచిపెట్టలేక పెద్ద

# * మా సంసారాలు

" ప్రియమైన తమ్ముడికి,

ఈమధ్య నేను చేసిన ఒకపరిశోధనసంగతులు నీకు తెలియజెయ్యాలని బుద్ధిపుట్టి, దీనివల్ల నీకు కలిగే లాభ మేదేనా వుంటే కలుగుతుందనీ, యీ వుత్తరం, అనేకపనుల్లో తెరిపిచేసుకుని రాస్తున్నా—

" నేను యెన్నోమార్లు అనుకున్నాను, ఆడదాని సంసారం చాలకష్టమనీ, మొగవాడి పనిలాగు సుళువైనది కాదనీ, మొగవాడిపని యేముంది—యిట్టే భోంచెయ్యడం, వెళ్లడం, ఆఫీసులో కూచోడం, యింటికిరావడం; ఆడదో మరి, పొద్దున్న అయిదు మొదలు రాత్రి పదకొండింటివరకూ తెరిపిలేకుండా కాలు వంచడానికేనా వీలులేకుండా, నడుమువాల్చడానికేనా అవకాశం లేకుండా పనిచేస్తూవుండవలసిందే అని. అంచేత యెప్పుడూ మాఆవిడే నాకంటే యెక్కువ కష్టపడుతూందనీ, పాపం! దాని ఋణం నేను యెప్పటికీ తీర్చుకోలేననీ అనుకునేవాణ్ణి. కాని యెప్పుడెప్పుడేనా కొంచెం పరిశీలించి చూసేవాణ్ణి. చూస్తే యెంత సేపూ కడిగిందే కడగడం, తుడిచిందే తుడవడం, చేసిందే చెయ్యడం అని అనిపించేది. అయినా నాపరిశీలనే తప్పని నాలో నేను బుద్ధిచెప్పుగుని వూరుకునేవాణ్ణి. ఈపరిశీలనయినా యెందుకొచ్చేదంటే, ఎప్పుడేనా 'ఈ పుస్తకం చదువు, ఇది యెంతో బాగుంటుంది, ఇది చదువు' అనేవాణ్ణి. కాని ఆపుస్తకం మొదటి పుటేనా యెప్పుడూ తిప్పివుండడం నేను చూసివుండలేదు. అంతటితో ఆపుస్తకంమీద నాకూ, దానికీ కూడా విరక్తి పుట్టి

---

* భారతి - ఆగష్టు 1933

పోయేది. 'పోనీ, నువ్వు పుస్తకాలు చదవక్కర్లేదులే. ఇంటికి తెప్పిస్తూన్న ఆంధ్రపత్రిక చదువు, చాలు. నాకు అంతకంటే నువ్వు మరేమీ వుపకారం చెయ్యక్కర్లేదు. అసలు నువ్వుకూడా చదవడానికనే నేను తెలుగుపత్రిక తెప్పిస్తున్నాను' అని అనేక సార్లు చెప్పేను. కాని అ పత్రికేనా అది చదవగా నేను యెన్నడూ చూసివుండలేదు. 'పాపం! పని తెరిపిలేదు. అంచేత చదవలేదు' అని అనుకునేవాణ్ణి. అంతేకాని మరొకమోస్తరుగా బద్ధకమనిగాని, పనులు తెమల్చుకో లేదనికాని యెన్నడూ అనుకో లేదు. ఎప్పుడెప్పుడేనా మీావదిన కుచ్చెల కథ తీసేది. అదేనా నాలుగు బంతులు చదివేది. అంతటితో సరదా, ఉత్సాహం తగ్గిపోయేవి. ఏకొడుకు వెధవో చదవనియ్యకుండా వున్నాడు, ఈ వెధవలతో చదువేమిటి నామొహ మని వాళ్లని నాలుగు తిట్టి చరుపులు చరిచి ఆపుస్తకం ఒకమూలకి గిరవాటేసేది. ఈ మోస్తరుగా నడిచింది కాలం.

"ఆమధ్య మా మామగారు 'కూతురినీ, పిల్లలినీ ఒక మారు మావూరు పంపించు, నాలుగురోజు లిక్కడుండి వస్తారు' అని వుత్తరం రాసేరు. 'నేను అనేకపనుల్లో వుంటున్నాను. నా కిప్పుడు వీలులేదు" అని చెప్పి వుత్తరం రాసెయ్యాలను కున్నాను. కాని 'ఇంతకంటే మనకు మరొకప్పుడుమట్టుగు తెరిపి తగలడతుందా' అని అనిపించీ, ఇంతకీ మరొక కారణముంది కూడా, మరేం లేదు, నే నొక్కడినీ సంసారం చేసిచూస్తే యెలాగుంటుందో, మాఆవిడ పడ్డ కష్టాలన్నీ నేనూ పడి తెలుసుకుందామనీ యోచనకలిగి, ముఖ్యంగా యీా పరిశోధనకోసమే దాన్ని పుట్టింటికి పంపేసేను. వెళ్లేటప్పుడు అది పిల్లలనందరినీ తనతో తీసికెళతానంది. కాని నేనే వాళ్లని విడిచిపెట్టలేక పెద్ద

వాణ్ణిమాత్రం నాదగ్గిర వుంచుకొని చిన్నవాళ్ల నిద్దరినీ తనతో తీసికెళ్లమన్నాను. పెద్దవాణ్ణి నాదగ్గిరే వుంచుకొన్నాను. వెళ్లే ముందరే మీవదిన నన్ను 'ఒటేల్లో జేరిపొండి. లేకపోతే మీరు నెగ్గలేరు. పోనీఅంటే ఆవు, దూడ వున్నాయి. వాటికి చాకిరీ చెయ్యాలి. ఈపాట్లు పడలేరు. వంట గింట పెట్టుగోకండి. ఆ వెధవకుక్కరు మళ్లా పైకి తీస్తారేమో' అంటూ హితంచెప్పింది. నేను అన్నిటికీ 'ఊ' కొట్టేను. అదీ వెళ్లిపోయేక కుక్కరు పైకితీసి వండుకోడం ప్రారంభించేను. కుక్కరుసంగతి నీకు తెలియనే తెలుసు, అదెంతసుఖవో. అమృతంలా వుంటుంది పచనం. అయిదునిమిషాలపని, అంతే.

"నా కొత్తసంసారంలో నౌకరివాడు తనపని తను చేసుకు పోయేవాడు, దాసీది దానిపని అది చేసుకుపోయేది. ఆచార వ్యవహారాల్లో మీవదినెపనికీ, నా పనికీ యెంతేనా భేదముంది. తను అంటూ సంటూ అని పేరు చెప్పి, గిన్నెతగిలినా తగలక పోయినా సరే, చేతులు కడుక్కునేది. మరి నేనో, అంట్లగిన్నెలు ముట్టుగున్నా సరే చేతి కేదేనా అంటుగుంటేనే చెయ్యి కడు క్కునేవాణ్ణి. కాని లేకపోతే మానేసేవాణ్ణి. ఈ మోస్తరుగా నీళ్లఖర్చు తగ్గిపోయింది. ఇల్లు యెప్పుడూ తేమగా వుండక, పొడిగా శుభ్రంగా వుండేది. నీటిలో మునిగి తేలుతూ వుండక పోడంవల్ల నా కాళ్లూ చేతులూ వొరిసిపోలేదు.

"మీ వదినకి యిరవైయారు రకాల మడి. తలకు నీళ్లుపోసు కుంటే ముట్టుగోవచ్చు కొన్ని. కంఠస్నానం చేస్తే ముట్టుగో వచ్చు మరికొన్ని. మడిబట్ట కట్టుకుంటే ముట్టుగోవచ్చు కొన్ని. బట్ట లేకుంటే - దానికే పెద్ద మడి అనిపేరు-ముట్టుగోవచ్చు మరి కొన్ని. నాతో యిన్ని రకాల మడి లేదు. చెయ్యి శుభ్రంగా

వుంటేసరి, అన్నివస్తువులూ ముట్టుగోవచ్చు. అంతా వొక్క-మడే. ఇన్నిరకాల మడి వున్నా మీవదినెకి కొన్నికొన్ని రోజుల్లో కొన్నికొన్ని పనికిరావట! ఆదివారంనాడు వుసిరీవచ్చడి ముట్టుగోదు! అమావాస్యనాడు పెద్ద బచ్చలికూర వండదు! నాలో యిలాంటి చిక్కు-లేమీ లేవు. పైఆచారాల్లో వేటినీ నేను పాటించలేదు, జ్ఞానవంతులిని నమ్మించగలిగిన అంశం వాటిలో వొకటీ లేదు కాబట్టి.

"మీ వదిన యెప్పుడూ దాసీదాన్ని రాచ్చిప్పలూ, రుబ్బురోలూ, పాలకుండా కడగనిచ్చేదికాదు. ఆచారానికి పనికిరాదుట! కాని తక్కి-నవాటికీ వీటికీ భేదం నాకేమీ కనబడనందువల్ల వాటినికూడా దాసీదానిచేతే కడిగించేవాణ్ణి, తరవాతి సంగతేమైతే అదవుతుందని. ఎవళ్లమట్టుకు వాళ్లు వాళ్ల పనులన్నీ చేసుగుపోతూవుండేవాళ్లు. కొసకి కూరలదానితోనైనా నే నెప్పుడూ రెండుమాటలకంటే యెక్కు-వ ఆడి యెరగను. ఆఖరికి నా కనిపించింది, ఆడసంసారమంటే యెంతసుఖమో అని, యెంతసుళువో అనీ, మొగవాడు పడేపాటులో యిది యెన్నోవంతో అనీ. ఎట్లాచ్చీ సాయంత్రం షికారుమట్టుకు నష్టపోయేవాణ్ణి. ఎంచేతంటే, పనిచేసే మనిషి అంట్లకోసం ఆ వేళకే వస్తుంది. అటుతర్వాత దూడలు వస్తాయి. పాలుతీసేవాడు వస్తాడు. అంచేత సాయింత్రం షికారువెళ్లడానికి వీలు లేకపోయేది. పొద్దున్న వెళ్లడానికీ వీలుండేదికాదు. అదొక్క-టే యిబ్బందని అనిపించింది,

"చెబితే నువ్వు నమ్ముతావో నమ్మవో - మీవదిన యింట్లో లేకపోయింది, ఎన్నిపనులు చేసుగోవలసి వచ్చిందో అని నాకు ఒక్క-నాడేనా అనిపించలేదు. అవ్వాళ్లో అదీ పిల్లలూ

క్షేమంగా వున్నారో లేదో అన్నమాటేగాని మరేమీ నా కని పించలేదు. ఇలాగుంటూ వుండగా—రెణ్ణెలయింది అది వెళ్లి—మామగారి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది—'మీవూరికి పిల్లను పంపిస్తున్నాను. రైలు మీవూరికి రాత్రి పదింటికి వస్తుంది. పిల్లల తోటి వస్తూందికాబట్టి నువ్వు రైలు స్టేషనికి వచ్చి జాగ్రత్తగా వాళ్లని యింటికి తీసుకువెళ్ల వలసింది' అని. 'సరే' అని అనుకున్నాను. అది వచ్చేరోజున నేను ట్రెయినికి వెళ్లేను. పిల్లాడితో కూడా ట్రయినుమీద వచ్చింది. అందరం యింటికి ఎద్దుబండి మీద వచ్చేసేం. పిల్లలూ తనూ వాళ్ళవూళ్లోనే సాయంత్రం భోంచేసి రైలెక్కుతారని యెరిగివుండడంవల్ల నేను వాళ్లకి వంట ప్రయత్నం చెయ్యలేదు. ఏదో కబుర్లన్నీ చెప్పుగున్నాం. ఇంతట్లోకి తను లాంతరుపట్టుగొచ్చి 'మీచెయ్యి ఇలా చూపించండి' అంది. 'ఏమీ యెందు' కన్నాను. 'చూపిద్దురూ, యెందుకో' అంది పెళ్లానికి గాక మరి వూళ్లోవాళ్ళకా చనువని చెయ్యి చూపించేను. చూసింది. 'ఆచెయ్యి యియ్యండి' అంది. ఇచ్చేను. 'ఏదీ కాళ్లు చూపించండి' అంది. 'ఎందుకూ' అంటూ కాళ్లు కూడ చూపించేను, చూసి ఆశ్చర్యంతో 'మీకాళ్లూ, చేతులూ యీపాటికి వొరిసిపోయి నాకాళ్లూ, చేతులులాగే వుంటా యను కున్నాను' అంది. ఇంటిదగ్గిర వంటచేసుగుంటున్నానని నేను వెనకే వొకవుత్తరంలో రాసేనులే. 'అయితే యెలాగున్నా' యన్నాను. 'రాళ్లలాగున్నా' యంది. 'అదే మొగాడి సంసారానికీ, ఆడదాని సంసారానికీ భేద' మన్నాను. 'మీ అనాచారపు పనులుచూస్తే నీళ్ళకికూడా భయమే, లేకుంటే కాళ్ళూ, చేతులూవొరిసి వుచ్చిపోయివుండవూ యీపాటికి' అంది. మీ వదిన కాళ్ళూ, చేతులూ, యెప్పుడూ వొరిసి వుచ్చి వురుగు

లోడుతూ వుంటాయి. ఆసుపత్రినుంచి నేకనేకసార్లు మందు తెచ్చియిచ్చేను. నేను చెయ్యగలతని అంతే. తనెప్పుడూ తనకు తోచి మందుపెట్టుకున్న పాపాన్ని పోలేదు. నేను పోరగా పోరగా యెప్పుడేనా మందు పెట్టుకునేది.

"తెల్లారింది. ప్రయాణపు బడలికచేత ఆరింటికి లేచింది. నౌకరీవాడు వచ్చేడు. వచ్చినవెంటనే నాలుగుతిట్లు తిన్నాడు, 'ఇంతఆలస్యంగా వచ్చావేం వెధవా?' అన్నది మొదటి వాక్యంగా. ఆతిట్లు చెవుల్లో పడి నేనూ లేచి మళ్ళా రెండు నెల్లకి విన్నానుకదా యీ కంఠస్వరమని మనస్సులోపల నంతోషించేను. వాడు 'అమ్మగారూ, అగ్గిపెట్టి యిత్తారా అండి, కుంపటి యెలిగిత్తా కాఫీకి' అన్నాడు. 'అగ్గిపెట్టె అడుగుతావుట్రా వెధవా? నువ్వు ముట్టుకుంటే అగ్గిపెట్టి యెందుకేనా పనికొస్తుందిట్రా, పెంటమీద పారేసుకోవాలికాని? నీఅనాచారం పనులు నాదగ్గిర పనికిరావు, నీఅయ్యవారిదగ్గిరగాని' అని మొదలెట్టింది. వాడు వూరుకున్నాడు. ఒక తాటికమ్మ పట్టుకొచ్చేడు. అది వెలిగించి యిచ్చింది ఆవిడ...... పళ్లు తోముకుంటూ వుంటే కాపది వచ్చింది. వచ్చి 'అమ్మగా రొచ్చేరా అండి. చాలాకాల మయిందండి యెల్లి' అంది. ఆమాటలకి జవాబు కమోసు! 'ఇంత ఆలస్యంగా వచ్చేవేం? ఇంకా అయ్యగారే పనిచేస్తున్నా రనుకున్నావేమిటి? ఎవళ్లేనా బ్రాహ్మలున్న వాళ్ల యింట్లో, యిప్పుడా పాచిపని చేస్తారు. అడిగేవాళ్ళు లేకగాని?' అని మొదలెట్టి కోపపడింది. అది వూరుకుంది. కాలకృత్యాలయేక అంట్లు-అంటే కుక్కరుగిన్నెలు-దాసీదానికి పడేసింది. నేను వంటింటిపక్కని వసారాలో కూచున్నాను, చంటిపిల్లాణ్ణి దగ్గిరపెట్టుగుని. మీ వదిన వంటగదిలో కాలుపెట్టి వొక్క-

గంతు యీావలికి వేసింది. వేసి, ' నరకం, నరకం, మహానరక మంటే నమ్మండి. మహాప్రభో, యిలాంటి కొంపలో నాబోటి దొక్కశుద్ధిగల పాడైనా వుండగలదా ? నేను వెళ్ళేటప్పు డెలాగుంది ? ఇప్పు డెలాగుంది ? ఏమేనా అంటే నానోరు బయటపడడమే గాని... ...' అని వొకచిన్న ఉపన్యాస మిచ్చి ' వారంరోజుల వరకూ యిల్లు సవరించుకోడమే అయిపోతుం ' దని సూచించి సంస్కరణ మొదలుపెట్టింది. ఇంట్లోవున్న వుప్పులు, పప్పులూ—నే ననాచారంగా ముట్టుకున్నానుగా మరి; అంచేత వనికిరావ్వ—దాసీ దాని కిచ్చేసింది. నూనినేతిగిన్నె లివతలపారేసింది. పోపుసామగ్రి వాకిట్లోకే వచ్చింది. బుట్టలూ, తట్టలూ గోడవతల విసిరేసింది. ఇంట్లోవున్న బిందెదగ్గరనుంచి గుల్ళీవరకు యివతల పడేసింది. ఇవన్నీ దాసీది తోమడానికే! నేను మాటాడకుండా అవతలికి వెళ్ళిపోయేను; చెప్పి లాభమేమీా నాకు కనబడ లేదు, అంచేత. ఇల్లంతా గోడలదగ్గిరనుంచి, పీటలదగ్గిరనుంచి కడిగేసింది. అంత పనీ అయేప్పటికి తొమ్మిదింపావు అయింది. అప్పుడు బిందెపట్టు కుని గోదావరికి స్నానానికి బయలుదేరింది. ఒక అరగంటలో వచ్చింది. పొయ్యిలో నిప్పువేసింది. ఆఫీసుకి వెళ్ళడానికి నేను కోటుగట్రా వేసుగున్నాను. 'ఓయ్ ! మధ్యాన్నం సెలవుపుచ్చుగు వస్తా భోజనాని ' కన్నాను. ' రండి అప్పటికి తెములుతుంది లెండి ' అంది. నేను ఆఫీసుకి బయలుదేరేను. మా పెద్దబ్బాయికి దారిలో హొటేలులో భోజనం పెట్టించి స్కూలుకు దిగ బెట్టేను.

మధ్యాన్నం వచ్చి భోంచేసేను. సాయంత్రమయింది. షికారు అలవాటు తప్పిపోడంచేత యింట్లోనే కూచున్నాను. దాసీది వచ్చింది. అంట్లగిన్నెలు అవతల పారేసింది మీావదిన. అంట్లు

తోముంది దాసీది. దాసీది ఇల్లూడ్చింది, అవులసాలలో పని అంతా చేసింది. ఇంక వెళిపోతానంది. అది వెళిపోతానంటే యేదోపని పురమాయించింది, మీావదిన. అబ్బాయీ! నే నెప్పుడూ కూడా చూడలేదు, దాసీదికాని, నౌకరుకాని యింటికి పోతానంటే సంతోషంతో మీావదిన యింటికి వెళ్ళమనడం. ఏదోపని పురమాయించి వాళ్ళు యేడుస్తావుంటే పంపడం. నెల అయినవెంటనే వాళ్ళకి యెన్నడూ సరిగ్గా జీతంరాళ్ళు యిచ్చి యెరుగదు. నాలుగు రోజులు ఆలస్యంచేసో, లేక ఏదోకొంత యిచ్చేసి కొంత అట్టే పెట్టుగునో, యేదో యిలాగే చేస్తావుం టుంది. నెలాఖరున వెంటనే జీతమిచ్చేస్తే వాళ్ళకి బద్ధకం బలిసి పోతుందిట. ఆ జ్ఞానం మరెవరికీలేదు. గవర్నమెంటువారు యీా తెలివిలేకే మాకు నెలఅయిన వెంటనే జీతమిచ్చేస్తున్నారు... ... దాసీది వెళిపోయింది. ఆతర్వాత అన్నంగిన్నె తీస్తావుంటే దీవం దగ్గిర రవ్వంథమసి కనపడినట్టనిపించి అంచుకింద నిదానంగా చూపింది, చూస్తే ఆవగింజలో సగమంతమసి కనపడింది. దానితో దాసీదానిమీాద మండిపడిపోయి, తప్పేలా తోముకుని, నూతిదగ్గిర స్నానంచేసింది.

"అటుతర్వాత వంటకి పొయ్యిలో నిప్పువేసింది. అప్పుడు నేను అన్నాను, 'పోనీ కుక్కరుతో వండు. కుక్కరువంటరుచి నీకు తెలుస్తుంది. మరింత విడిచి పెట్టవు' అని. 'ఆకుక్కర్లు గిక్కర్లు నాకు పనికిరావు, మీావంటలకేగాని. మనుష్యజాతి పుట్టినదగ్గిర నుంచీ వుంది యీా వంట' అంది. దానికి నేను 'ఉండవచ్చులే. అదికాదు నేను చెప్పేది. నీకు పని తెరిపివుంటుంది. ఎందుకలా హైరానమయిపోతావు పొయ్యిదగ్గిర? రెండుగంటలనర నేవు పొయ్యి దగ్గిరే కనిపెట్టుకుకూచుంటావు. పొగవల్ల కంళ్లుచెడిపోతాయి. వేడి

వల్ల వొళ్లు చెడిపోతుంది. మరి కుక్కరయితే అయిదునిమిషాలలో పనిఅంతా పూర్తిచేసుకుని మరొకగంటసేపటికి వచ్చిభోంచెయ్య వచ్చు' అన్నాను. అందుకు తాను 'దానిరుచి బాగుండదు' అంది. 'అవును, దానిరుచి దానిది, పొయ్యివంటరుచి పొయ్యి వంటది. బూర్లరుచి బూర్లది, గార్లరుచి గార్లది. ఒకదానితో వొకటి పోల్చగలమా' అన్నాను. ఏమైనా దాన్ని వొప్పించ లేక పోయేను. పోనీకదా అని అప్పటికి వూరుకున్నాను. మరొకప్పటికి వాయిదా వేసేను. వంటయేక భోంచేసి నిద్రపోయేము.

"మర్నాడు పొద్దున్న యేదో పెద్దపనివున్నట్టుగా పెంద్రాడే లేచింది మీావదిన. దానీదాన్ని రానిచ్చి దానిదగ్గిర ఒకగంట న్నరసేపు లెక్చరిచ్చింది, నిన్న గిన్నెకు మసివుండడంమీాద. అది యింటిదగ్గర వున్నంతసేపూ కుమ్మరి పురుగుగొలికినట్టుగా గొలికేసింది. అది యెప్పుడేనా ఖర్మంచాలక ఒకమాట అంటే చాలు, మళ్ల మరొకమాటు పెళపెళ మనిపించేసేది. 'భోంచేస్తూ వుంటే నాతో చెప్పింది, 'దానీదాన్ని యివాళ ఝూడించి విడిచి పెట్టేసేనండి' అని. అందుకునేను 'నీమీాద యెంతతప్పున్నా నే నెప్పుడేనా నిన్ను ఝూడించి విడిచిపెట్టేసేనా' అనిఅడిగెను. దానితోటి మొహం అల్చిప్పంత చేసుగుంది. సాయంత్రంవరకూ ధుమధుమలాడుతూనేవుంది. నాతో మాటాడలేదు. పోనీ అని నేనూ వూరుకున్నాను. రాత్రి రాజీపడ్డాం.

"అబ్బాయీ! ఎందు కిన్ని చెప్పడం. మళ్లీ మొదలు— కూరగాయలదానితోటి, బియ్యపుమనిషితోటి, అపరదినుసులు తెచ్చే మనిషితోటి—ఒకటేమిటి ఒక అరగంటసేపు వాదిస్తే గాని ఒకకూరగాయేనా కొనదు. నిన్నటికినిన్న దానీది పిడకలు తిరగవెయ్యలేదని గంటన్నరసేపు లెక్చరిచ్చింది. ఈఘటనలే

నాకూ వచ్చేవి. కాని నేను దానీమనిషితో 'అపిడక లివాళ తిరగవెయ్యాలి' అని ఒకమాట అనేవాణ్ణి. అది తిరగవేసేది. ఒక్కమాటతో తెమిలిపోయేదానికి ఒకగంటన్నరసేపు వుపన్యాస మివ్వడం. ఇదీ ఆడదాని స్వభావం. .........దానీది చెప్పిం దిట, నేను దానికి రాచ్చిప్పలూ, పాలకుండా తోమడానికి వేసే వాణ్ణనీ, రుబ్బురోలు దానిచేతే కడిగించేవాణ్ణనీ. అంచేత రాచ్చి ప్పలూ, పాలకుండా దాని కిచ్చేసింది. రుబ్బురోలుమీద పసువు నీళ్లు చల్లి పదిబిందెల పేడనీళ్లతో శుద్ధిచేసింది. ఇంకెందుకిన్ని సార్లు చెప్పడం, స్నానాలూ, కడగడాలూ, నీళ్లలో మునిగి తేలుతూవుండడం మళ్లా మొదలు... ఆఫీసువేళకి సరిగ్గా వంట చేసిపెట్టిన రోజు లేదు. లేనిపోని పనులు కల్పించుకుంటూవుంటే వేళ కెక్కడ వండగలదు? రాత్రి పదకొండింటికికూడా యిల్లు కడుగుతూన్న చప్పుడే, అవెన్నిపను లున్నాయో యేమిటో?

"నూతిదగ్గర పొరుగువాళ్లతో యుద్ధమైపోతూవుంటుంది రోజురోజూ. ఒక్కొక్కప్పుడు మహాభారతయుద్ధమంత అయి పోతూవుంటుంది. నిన్న పక్కయింటివాళ్లయింట్లోంచి కాకి అన్నం కెరడు యెత్తుకుపోయి మాపెరడుమీదుగా యెగురుతూ పోగా పెరట్లో నాలుగుమెతుకులు రాలేయి. దానికోసమని పక్క యింటివాళ్లతో తగవులాడింది! ఏమని చెప్పమన్నావు, పగలు పన్నెండుగంటలూ యీమోస్తరుగానే కాలక్షేపమయిపోతుంది. పుస్తకం ముట్టడానికేనా అవకాశముండదు. ఈ మోస్తరుగా కాలక్షేపం చెయ్యడం మనతరంకాదు. ఏదైనా దాన్ని యెప్పుడూ పల్లెత్తుమాట అని యెరగను. తిట్టడంగాని, కొట్టడం గాని యెన్నడూ లేదు. తిట్టడంవల్లా, కొట్టడంవల్లా బాగుపడ్డ సంసారం యింతవరకూ నాకు ఒక్కటేనా కనబడలేదు. అంచేత

నే నెప్పుడూ దాన్ని యేమీ అనను. నేను చేసే పనేమిటంటే సలహా చెప్పడం, హితోపదేశం చెయ్యడం. అంతే. ప్రేమ, దయవల్ల జయించవలసిందేకాని దీనికి మరొకదారి లేదు. ముమ్మాటికీ లేదు.

“ నా ఒక్క-సంసారమే యిలాగ వుందనుకుంటున్నావేమో! అన్ని సంసారాలూ యింతే. కోటి కొక్కడైనా ఒకటి వేరుగా వుందేమో! అంచేతే నాకు ప్రత్యేకవిచారం లేదు. చదువు కొన్న వాడికీ, చదువుకోని ఆడదానికీ సంసారంచెయ్యడంలో యింత తేడావుంటుంది కదా అని నాకు ఆశ్చర్యం వేస్తూవుంటుంది. ఏపనికయినా చదువు అవసరమే. చదువుయొక్క లాభం తెలిసేక ఆడవాళ్లకి చదువువద్దన్నవాళ్లని గుండేసి కొట్టేసినా పాపం రాదు అని అనిపిస్తూంది. నిన్ను మీ పెద్దపిల్లని చదువులో ప్రవేశపెట్టమని అంటూవుండడం చదువు వుపయోగ మెరిగే. అంతా క్షేమం.

ఇట్లు : సప్రియసోదరుడు,

సూర్యారావు ”



# * మొగుడూ పెళ్లాంకబుర్లు

"......... "

"......... "

"మీా స్నేహితుడు సోమయ్యగారి పెళ్లాం చెప్పిందండీ 'మా ఆయన నన్నేమనరు, పాపం మంచివారు! నాకే ఎప్పుడేనా కోపం వేసుకొస్తూవుంటుంది కేకలేస్తూవుంటా'నని. ఆయన్ని మొన్న సాయింత్రం అడిగిందట, మా అప్పకొడుక్కి—"

"ఔనుగాని ఇంకా ఎంతసేపు చెప్తావు చెప్పు, పోనీగాని. ఇప్పటికి రెండు గంటలనుంచి చెప్తున్నావు, అల్ల ఆ జతను గురించీ, ఇల్ల ఈజతనుగురించీ. ఇంకా ఎంతసేపు చెప్తావు, మొగుడూ పెళ్లాల కబుర్లు విసుగేనా వెయ్యదా నీకు?"

"పోనీ లెండిగాని వెంకట్రావుగారు సీతమ్మను చితక పొడి చేశాడుట."

"ఎందుకూ?"

"మరేమో ఆయనకు ఆసలే విసుగ్గా వుంటూవుంటే ఆవిడ నాకేమేనా చేయించి పెడితేనే పెట్టారు లేకపోతే చచ్చిపోతా నందిట."

"ఆఁ."

"అంటే ఆయన ఆమట్టుగచస్తే చావనీ అని చితక పొడి చేశాడుట."

"పాపం. ఎంతపని చేశాడు."

"ఆయనైనా పాపం ఆవిణ్ణి ఎప్పుడూ కొడుతూవుండడుట. ఆ సంగతి ఆవిడే చెప్పింది మొన్న పేరంటకానికి వచ్చినప్పుడు."

---

* వినోదిని డిశంబరు 1934

"అదిగో మళ్లా మొదలెట్టావు మొగుడూ పెళ్లాల కబుర్లు. దానికో అంతూవంతూ అంటూ లేదా అని నేననడం. నువ్వూ నేనూ ఒంటరిగా కూచున్నప్పుడు ఇంతకుమించి మరోసంగతి ఎప్పుడేనా మాట్లాడావూ. ఇది తప్పని నేను చెప్పడంలేదు. వాటినిగురించికూడ చెప్పుకోవలసిందే. కాని ఎప్పుడూకూడా వాటిని గురించేనా? ఎప్పుడు విన్నా అవేనా? లోకంలో తెలుసుకోవలసిన సంగతులు యింకా చాలా వున్నాయి కదా?"

"ఇంకా యేమున్నాయో చెప్పండీ పోనీ."

"రోజూ ఇంటికి ఆంధ్రపత్రిక తెప్పిస్తున్నాను. అది చదువుతూవుంటే ఎన్నేనా సంగతులు తెలుస్తాయి."

"పోనీ చెప్పండీ మీకు తెలిసిన సంగతులేమిటో. నాకు తెలిసిన సంగతులు నేను చెప్పాను."

"అదిగదే నేనూ అనడం. నువ్వు మొగుడూ పెళ్ళాం కబుర్లకంటే ఎక్కువ తెలుసుకోవాలని. ఆంధ్రపత్రిక చదువుతూవుంటే ఎన్నేనా సంగతులు తెలుస్తాయి."

"పోనీ చెప్పరాదూ మీా కేమేమి సంగతులు తెలుసో, నేనూ వింటాను."

"అయితే విను. గాంధీ మహాత్ముడు కాంగ్రెసునుంచి విడిపోతానంటున్నాడు."

"పాపం, ఏం చేసిందీ?"

"ఒంటికేమీా చెయ్యలేదు. ఆయన చెప్పినవన్నీ కాంగ్రెసు సభ్యులు ఒప్పుకోడంలేదు. అందుచేత."

"ఏమేమిటి?"

"కాంగ్రెసు సభ్యత్వానికి చెల్లించవలసిన పావలానూలు రూపంగా వుండాలన్నాడు. కాంగ్రెసు సభ్యుడు ఖద్దరు తప్ప

మరొకటి కట్టుకోకూడ దన్నాడు.”

“పోనీ ఇవన్నీ ఆయన పెళ్ళామేనా చేస్తూండా ?”

“ఆవిడ చెయ్యకేం ?”

“అయితే ఆవిడ ఇప్పుడు ఎక్కడుందీ ?”

“ఆయనదగ్గిరే వుండేమో.”

“ఇద్దరూ ఎప్పుడేనా మాట్లాడుకుంటారా?”

“మళ్ళా మొగుడూ పెళ్ళాం కబుర్లలోకి దించావూ ?”

“అబ్బే! వాళ్ళిద్దరూ అన్యోన్యంగా వుంటారా అని అడగడం.”

“ఆయన గృహస్థ సన్యాసి. అటువంటివాడికి ఇంకా పెళ్ళామంటూ యెక్కడ !”

“పాపం! పోనీగాని వీరేశలింగంగారిని గురించి చెప్పండి జాగ్రత్తగా వింటాను.”

“పోనీ అలేనా విను.”

“వీరేశలింగంగారు మహాచెడ్డ కష్టపడ్డాడు బాల వితంతువులకు వివాహం చెయ్యడంకోసం.”

“అదీ ఒక మంచిపనే! ఇప్పుడు అంతా అలాగే చేసుకొంటున్నారు కాబట్టి అదీ ఒక మంచిపనే అయిపోతూంది లెండి.”

“ఎన్నో బాధలు పడ్డాడు పాపం ఆపెళ్ళిళ్ళు చెయ్యడానికి.”

“సరేగాని చివరికి ఇంట్లో పెళ్లామేనా ఒప్పుకుందా ?”

“ఆయన భార్యపేరు రాజ్యలక్ష్మి. ఆవిడ పాపం చాలా మంచియిల్లాలు. ఆవిడ సహాయం చెయ్యబట్టే ఆయన యిన్ని పనులు చెయ్యగలిగాడు.”

“మొగుడంటే ప్రేమే పాపం! మంచి యిల్లాలే!”

“ఒకమారు అవిణ్ణి బంధువులంతా—”

"అయితే ఆయనికి కూడ ఆవిడమీద ప్రేమ వుండేదా?"

"అదిగో మళ్ళా అవే కబుర్లు మొదలెట్టావు. ఎన్నిసార్లని చెప్పడం నీకు? మరోటి చెబుతున్నా మళ్ళా అదేనా? చదువు కుంటే యిలాంటివన్నీ తగ్గిపోతాయి."

"మన యింటిపక్కని రాజేశ్వరరావుగారు తనకు కావలసిన వన్నీ కొనుక్కోమంటాడుట సీతమ్మగారిని."

"ఈ కబుర్లలో అంతంటూ లేదా అని నేనడగడం. ఇంత కంటే ఎక్కువ సంగతులు తెలుసుకో అక్కర్లేదాఅని, నేనండన. ఇంతకంటే ఎక్కువ సంగతులు తెలుసుకొంటేను నువ్వా ఎంత సేపూ వీటినిగురించే మాట్లాడతావా? మన బాగుకోసం, లోకం బాగుకోసం యింకాఎన్నో విషయాలనుగురించి మాట్లా డవలసివుంది. మనఇద్దరం ఒంటరిగా కూచున్నప్పుడల్లా వినుగూ విరామంలేకుండా ఇవేకబుర్లు చెప్తావుకదా. నీవల్ల చివరికి నేను కూడా చెడిపోతున్నాను. నన్నుకూడా పాడు చేస్తున్నావు. ఎంత దానివో నువ్వు. ఎంతసేపూ అవేకబుర్లాఅని."

"నాకేవి తెలుసో అవి చెప్తాను. అంతకంటే మరేం చెప్ప మన్నారు నన్ను?"

"అందుకనే నిన్ను ఆంధ్రపత్రికని చదవమంటూ వుండడం. స్త్రీలు చేసే సభలకు వెళ్లమంటూ వుండడం."

"అలాగే చేస్తాను లెండి యింక."

"అదిగో మీ మామగారు చెయ్యి కడుక్కుంటూన్న చప్పు డవుతూంది వెళ్ళు; ఏదేనా పని చెయ్యవలసి వుంటుంది."

"ఆవిణ్ణికూడా భోంచెయ్యనియ్యండి. నా భోజనం మీ భోజనం అయిపోయేయికా."

---

# * విద్య - వింత పశుత్వం

౧

'ఏమేవ్ !'

'ఎందుకూ ?'

'ఎప్పుడూ కొత్తే.'

'ఇది నాకు పాతగిలదు.'

'చదువుకోమని నీ కెన్నిసార్లు చెప్పాలి ?'

'చదువంటే చిన్నపిల్లలకే యేదుపొస్తుంది. పెద్దవాళ్లకు మరిరాదూ ?'

'నీయేడుపేగాని నాయేడుపు చూడవూ ?'

'ఊఁ.'

'నిన్న నీకు పంపించినచీటీ చూశావూ ?'

'చూడకుండానే పంపించానేమిటి మీరడిగిన వస్తువు ?'

'నేనడిగినవస్తువే పంపించానంటావూ ?'

'మరి !'

'దానిమీద వున్న దేమిటి, నువ్వు పంపించిం దేమిటి ?'

'మీరు చాంతాడుకాదూ పంపించమన్నారు ?'

'నీ తెలివితేటల కెంతేనా సంతోషించాను ! ఇంటిదగ్గిర తాళంచెవి మరిచిపోయాను, పంపించమని నేను రాస్తే చాంతాడు పంపిస్తావు ! చాంతా డెందుకూ వురేట్టుకోమనా ?

'మీకు వారం వర్జమూ లేదు. బుధవారం పూటా అలా అనుకోడ మేమిటి ?'

'మరి నేను రాసిం దేమిటి, నువ్వుపంపించిం దేమిటి ? పోనీ

---

* భారతి సెప్టెంబరు 1931 లో అచ్చయింది.

గొలుసుకట్టురాతేమోనంటే గవ్వల్లాంటి అక్షరాలు రాశాను, నీ తెలివి తేటలు తెలిసివుండే'.

'ఎవళ్ళకేనా చూపిద్దామంటే ఆచీటీలు చూపించకూడ దంటారు. అందులో యేంపరమరహస్యాలుండిపోతాయనో!'

'నీకు చదువురాకపోగానే రహస్యా లుండకపోతాయేమిటి? లేకుంటే నాకూ పరమసంతోషమే, ఏయేడుపు, యేమొర్ర వుండదు. తాళంచెవి మరిచిపోయానని బండబూతులు తిట్టాడు, ఆవెరిముండాకొడుకు వుద్యోగస్తుడు.'

'తప్పొస్తే తిట్టడూ!'

'అదుగదీ మాట! నావల్ల తప్పొస్తే తిట్టాడు. నీవల్ల తప్పొస్తే నేను తిట్టకూడదు. అంతేనా నువ్వనేది?'

'బుధవారంపూటా తిడుతూకూచోండి. వారం వర్జంలేదమ్మాయీ తిట్లకి.'

'మరయితే అక్షరంముక్కలు కాస్త నేర్చుకో.'

'ఆడవాళ్ళకి చదువు, మొగాళ్ళకి వంట.'

'ఏమిటీ!'

'ఏంలేదు.'

'నువ్వేదో పెద్దచదువు నేర్చేసుకుని నా ఆఫీసు పనిలో సహాయపడతా వనుకుంటున్నాను నేను!'

'సిగ్గుసిగ్గు, యింకా వుద్యోగం కూడా చెయ్యమంటారు కామోసు నాఖర్మం కాలిపోను. ఈ పాటికి వూరుకుందురూ. యెవరేనా వింటే నవ్విపోతారుకూడాను.'

'అయితే ఆఫీసుపనిలో చావమన్నా వేమిటి?'

'అలాంటిమాటలే ఆడవద్దన్నాను.'

'మరి కాస్తచదువుకో, నేనూ సుఖపడతాను, నువ్వూ సుఖ

వడతావు.'

'పోనీ నామాట వినండి. చదువొచ్చినవాళ్లంతా యెలా చెడిపోతున్నారో చూశారా ?'

'ఎవళ్లు చెడిపోయారో చెప్పు.'

'మాఅమ్మ వేలువిడిచినపెత్తల్లికూతురు అదేదో ఫార మమ్మా- నా కావెధవపేరే రావు- తర్డుఫారంక మోసు చదువు కుందిట. మొగుడిమాట అసలే వినదు. గింజుకునిచచ్చినానరే, గిజామన్నానరే.'

'తర్డుఫారంకూటా వొకచదువే. నల్లీవొళ యిల్లాలే, నాగ మయ్యా వొక బ్రాహ్మడే అన్నట్టు తర్డుఫారంకూడా వొకచదువే. ఇంకేం బుగ్గిలో వేలెట్టడమే చదువన్నావుకాదు, నీధర్మమా అంటూ. చదువురానిమనిషి కాబట్టే అలాచేస్తూంది. చదు వొచ్చినవాళ్లు బుద్ధిమంతులయే వుంటారు సామాన్యంగా. జ్ఞానం రావడానికి చదువుకోడంగాని దుష్టులవడానికీ, దుర్మార్గులవ డానికీ కాదు.'

'మీతో యెవళ్లు వాదించగలరూ.'

'ఈపాటికి పలకతియ్యి. కాస్త బుద్ధిగా చదువుకో. నువ్వూ సుఖపడతావు నేనూ సుఖపడతాను. ఒరే అబ్బాయీ! *కాస్త చదువుచెప్పు బాబూ. (అబ్బాయి వస్తాడు.) నాకు పనుంది. వెళుతున్నాగాని నువ్వు శ్రద్ధగా చదువుకో. తెలిసిందా. వింటు న్నావా' (వెళతాడు.)

'... ... ... ... ...'

'పిన్నీ !'

'ఊం.'

---

* అన్నగారుకు.

' పలకని పట్టుకో. '

' ఆరాయవలసిందేదో నువ్వేరాయి. '

' నేనురాశ్శాకేలే. ఈవృత్తులపాఠంలో పేర్లు చెప్తాను రాయి. 'మంగలి' 'కమ్మరి.'

' అబ్బ! నేనుపోయి చెంబులు తోముకోవాలి. వేళపోయింది. వెధవచదువు, తగలబెట్టినచదువు. నాపాలిటి యమదూతలా వచ్చింది. నాకు చదువూవద్దు, చట్టుబండలూ వద్దు. ' (వెళ్ళిపోతుంది భర్తవస్తాడు.)

' ఏమిరా ! పిన్ని చదువుకుంటూంది ? '

' నాకెందుకీవెధవచదువు. పోయి చెంబులు తోముకోవాలని వెళ్ళిపోయింది. '

' నువ్వువెళ్ళి పిలుచుకురా. (అబ్బాయి వెళతాడు.) శివ ! శివ ! నాకేం దిక్కుతోచడం లేదు. భర్తృత్వానికీ, ఉపాధ్యాయత్వానికీ యేమీ పొత్తు కనపడడం లేదు. రాతిగుండె చేసుకుని నేనెక్కడకొట్టేది. ప్రేమ, అనురాగం పెరగవలసిన చోట కొట్లూతిట్లూ, కఠినత్వమున్నా. బాబోయ్ ! ఆమామ గారి ముండాకొడుక్కి జ్ఞానం లేకపోవడంవల్ల కదా యీపాట్లు పడవలసివచ్చింది. వాడికే జ్ఞానముంటే యిలాగుండేదా ? సరే, ఏదో నెమ్మదిగా చెప్పిచూస్తాను, వింటేవింటుంది లేకపోతే నోరు మూసుకుని కూచుంటా. అంతేకాని పడకగదిని యుద్ధరంగ మెక్కడచేసుకోను ? నాపనికాదది.......ఇంకా రాలేదేం ? రానని మొండికేసి కూచుందేమో. నేనే అక్కడికి వెళ్ళి కనుక్కుంటా. '

౨

'ఏమిటిచేశావ్ వంట.'

'ముందు విస్తరిపెట్టుకునే అడగడం?'

'విస్తట్లో అన్నంరాసితప్ప మరేం కనబడడం లేదు.'

'మీరు తెచ్చుకున్న బియ్యమేకదూ, దంపుళ్లబియ్యం. అంబటికూడులాగ య్యెర్రగా వుంది. ఎవళ్లేనా చక్కగా గోళ్లలో యిమిడేటటువంటి, తెల్లటి బియ్యం తెచ్చుగుంటారా, లేక ముతకబియ్యం తెచ్చుగుంటారా?'

'వీటిలో సత్తువ తగలడ్డదని శాస్త్రజ్ఞులనడంవల్లకాదూ యీ బియ్యం తెచ్చేను. వెధవపొట్టు యెంత తిని యేంప్రయోజనం. సత్తువున్న తిండి తినాలా, ఊక నవలాలా?'

'మీయిష్టం. నాకు వాదనలు చేతకావు.'

'... ... ... ... ... ...'

'... ... ... ... ... ...'

'ముడిపెసలు పచ్చడి చెయ్యమన్నానుకదూ.'

'పోనీ నేనొకమాటడుగుతాగాని చెప్పండి' మాటాడితే కోపంగాని... ...'

'నాకు కోపమా! నాకంటే శాంతమైన మొగాడెక్కడేనా వుంటాడా.'

'ఎవళ్లమట్టుగు వాళ్లు అలాగ అనుకోకపోతే మరోలాగ అనుకుంటారేమిటి?'

'అలాగా!'

'నే ననేది వినండి. ఎవళ్లేనా ముడిపెసలు పచ్చడి చేసుకుంటారా?' లేక పెసరపప్పు పచ్చడి చేసుకుంటారా?'

'ముడిపెసల పచ్చడితింటేనే మంచిదిట. ఆ పొట్టులో విట

మిన్ను అనే జీవపదార్థాలున్నాయిట. అది శాస్త్రజ్ఞులన్నమాటే. నా తెలివితేటలు కావవి. మంచి తిండి తినక గడ్డితినడమెందుకు?'

'అన్నీ వింతలూ విపరీతాలూనమ్మా యీమనిషితోటి!'

'... ... ... ... ...'

'... ... ... ... ...'

'మళ్లీ సీసపుగిన్నెతోనే చారుపెట్టి యిత్తడి గరిటెతో వడ్డిస్తున్నా!'

'ఆ మాయచచ్చినాడు, ఇచ్చినతగరమంతా పుచ్చుకుని, వాడికేంపోయికాలం వచ్చిందో వాడిల్లుమాసిపోను, సీసపుగిన్నె మనన త్తిని కొట్టాడు.'

'ఔను, నిజమే. వాడు మోసంచేశాడు. మనం యేడ్చాం. మళ్ళా నేను మంచిగిన్నె పట్టుకొచ్చానుగా.'

'ఆగిన్నెమట్టుకు వాడుకోవద్దన్నారేమిటి. పెంటమీద పారెయ్యమన్నారా?'

'ఏడిసిన తెలివితేటలు. పశువు తెలివితేటలు... ...అయిత్తడి గరిటేమిటి చారులో.'

'మాఅమ్మ యెప్పుడూ అలాగే వడ్డిస్తుంది మా నాన్న యేడ్చినానరే, చచ్చినానరే.'

'అయితే నన్నూ అలాగే అంటావూ.'

'గురువారంపూటా తీరుబడిగా కూచుని అలాంటిమాట లేమిటి.'

'అయితే నిన్ను యేపూట అనవచ్చో, యేపూట అనకూడదో చెప్పు?'

'ఆతదాన్ని యెప్పుడూ అనకూడదు. తిట్టడం తిమ్మడం వాళగొప్ప యేమిటి?'

'అవును నోటితో చెప్పడం నాదే బుద్ధితక్కువ, చేతితో చెప్పాలికాని.'

'అదే తక్కువయింది!'

'... ... ... ... ... ...'

'... ... ... ... ... ...'

'ఉసిరికపచ్చడి కాస్తవెయ్యి.'

'ఇవాళ ముట్టుగోకూడదు.'

'దానికివచ్చిందీ పెద్దదయ్యం!'

'... ... ... ... .. ...'

'మరయితే బచ్చలికూరేనావండలేకపోయేవూ?'

'ఇవాళ బచ్చలికూర కోస్తారేమో కాస్త తెలిసినవాళ్ల నెవళ్లనేనా అడగండి. ఇవన్నీ మీయింట్లో ఆచారాలుగాని మరేయింట్లోను యిలాగుండదు.'

'అనాచారాలకీ దురాచారాలకీ మీచదువుల్లోనూ మీశాస్త్రంలోనూ ఆచారాలని పేరు.'

'నేను వాదించలేనుబాబూ.'

'ఏదో యివాళమట్టుగు భోజనమయింది. ఇంక-'

'విస్తరి మీ రెత్తకండీ!'

'నువ్వెంగిలివిస్తట్లో తినకూడదు.'

'అదంతా మీకెందుకూ ఆడవాళ్లం మేమేదో యేడుస్తాం.'

'ఎంగిలివిస్తట్లో తినకూడదని చెప్పానా?'

'అలాగేలెండి.'

'... ... ... ... ... ...'

'మళ్లీ తీస్తారెందుకూ. మీకు తెలియదుకాని మొగుడివిస్తట్లో తింటే తప్పులేదుట.'

'ఎంగిలివి స్తరిది.'

'అబ్బ! తనన్నమాటేగాని మరోటిలే దీ మనిషికి. ఇదిగో! మాఅమ్మ యేమైయేళ్లొచ్చినా మానాన్న యెంగిలి వి స్తట్లోనే కాని మరోదాంట్లో తినదు... ఈమొగాళ్లకి చెప్పలేమమ్మా. వెధవముండలికి పెళ్ళిళ్ళు చేసేరకం.'

3

'ఆలాంత రిలా తెచ్చిపెట్టం డొకమాటు.'

'నువ్వు తీసుకెళ్లు నేను చేస్తూన్న పని చూడడంలేదూ?'

'లాంతరు నేను ముట్టుగోకూడదు.'

'ఏమిా, దాన్ని దారపుపోగు లున్నాయేమిటి?"

'లాంతరు ముట్టుగుంటే మయిలడిపోనండీ. అందులో కిరసనాయిలుంది. ఇంగ్లీషువాడిమాయఅది.'

'అదిగదీసంగతి. ఇంకా చెప్పావుకాదు! నీ తెలివితేటలకెంతేనా సంతోషించాను. నీకు తెలిసిన మాయా వేదాంతం యేమొగాళ్లకేనా తెలుసా?'

'అయితే తీసుకురారేమిటి?'

'ఇంకా నన్నడగాలా?'

'చీకట్లోనే వెళతాను.'

'వెళుదూగాని... ...అదేమిటి రాత్రిపూటా స్నానమెందుకుచేశావూ?'

'ఒకమాటుకాదు, రెండుమాట్లుకాదు, మూడుమాట్లు చెయ్యవలసివచ్చింది. నాఖర్మాని కెవరేంచేస్తారూ? చచ్చిన ముండాకాపది గిన్నెల్ని మసివుంచేసింది. అప్పటికీ జాగ్రత్తగానే చూశానమ్మా. అయినా అంచులకింద రవంత వుండిపోయింది.

దాన్ని పుల్లెట్టి గోకిగోకి కడిగిపెట్టి స్నానంచేసి వస్తూవుంటే కంటికి శూద్రాడు కనపడ్డాడు. ఈ మైలకూడుకూడా యింట్లో యెక్కడ కలుపుగోడమని మళ్ళా స్నానంచేశాను. చేసివస్తూవుంటే అదేమిట్లో నాఖర్మంకాలా, ఇంతకీ తలరాత తప్పించడమెవరిశఖ్యం, కాలికి మెత్తగా తగిలింది. ఇదేమిటి చెప్మా అని చూస్తే గుడ్డపీలిక. నోరు నొక్కుకుని చచ్చినట్టువెళ్ళి మళ్లా స్నానంచేసి కాళ్ళు యెత్తెత్తివేసుగుంటూ వచ్చాను. ఏంచెయ్యమన్నారు? బ్రాహ్మల కుటుంబం, బ్రాహ్మణజన్మ, ఈకాలంలో బ్రాహ్మల కుటుంబంలో పుట్టడమే పాపమయిపోయింది.'

'నిజమే.'

'మీఅనాచారాలకి. మీమైలతిళ్లకి శూద్రపుట్టుకే సరిపోతుంది.'

'ఏడిసినగొప్పతనం. నోరుమూసుకో ... ... ... మొన్న వుపవాసం, నిన్ననోము. యివాళ మూడుస్నానాలున్నా? రేపు.—'

'... ... ... ... ... ...'

'మంచమెక్కడమున్నా.'

'ఊరికే యెందుకూ ఆశాపనార్థాలు. నిజంగా రాకపోయినా మీరన్నందుకేనా వొచ్చితీరుతుంది. నాకు తెలుసు మీమాట మహిమ.'

'అదీమాట. సరిలే. నేనై మందు తేను. నీఖర్మం యెలాగుంటే అలాగుంటావు.'

'నా కసలు మందుతినడమంటే అసహ్యాం; డోకొస్తుంది. మందుతింటే జ్వర మెక్కు వౌతుంది.'

'నీఖర్మం.'

'... ... ... ... ... ...'

'... ... ... ... ... ...'

'అలా నడవకండీ.'

'ఏమిా?'

'ఆదారినే అంటుగిన్నెలు తీసుకెళ్ళాను. పేడనీళ్ళుజల్లడం మరిచిపోయాను.'

'అయితే దారిఅంతటా చల్లుతావేమిటి?'

'ఇదిగో' నే వొక్కమాటచెప్తా వినండి. మా అమ్మ ఆచారంసంగతి మిాకసలు తెలియదుకమోను. నాఆచారంసంగతలావుంచండి.'

'ఏదీ చెప్పు విందాం.'

'భోజనాలయాక మాఅమ్మ పీటలూ, యిల్లేకాకుండా గోడలు కూడా కడుగుతుంది. బజారునుంచి తెచ్చినవస్తువుమిాద శుద్ధినీళ్లు జల్లితే గాని తియ్యనే తియ్యదూ. ఇదంతా మిాకు వెటకారంగా వుంటుంది కాని నేనుమట్టుకు నిజంచెప్తున్నాను. ఉప్పు కడిగి యెండలో పెడుతుంది.'

'ఆతల్లికి పుట్టినదానివేకదూనువ్వు. నువ్వు నిప్పు కడిగి తెచ్చుకుంటావు.'

'మిామాట లెప్పుడూ వొకలాగే వున్నాయి. ఇదంతా యెందుకు చెప్పానో తెలుసా?'

'ఎందుకూ?'

'కాళ్లమిాద నీళ్ళు పట్టండి. అక్కడ తొక్కరని నాఅనుమానం.'

'నేను వెళ్ళేక నీయిష్టంవచ్చిన ట్లేడువు.'

'నీళ్ళు పట్టండీ... అబ్బ! ఆడవాళ్లగోడవలు వీళ్ల కెందుకో. ఇలాంటి అనాచారపాళ్లకి మళ్లా పుట్టగతు లుంటాయా!'

౪

'ఏమండోయి!'

'ఊఁ.'

'అదేమిటో యెప్పుడూ మొహం ముడుచుకునే వుంటారు.'

'నీముఖవికాసం నాకు రమ్మంటే ఎలాగువస్తుంది. నువ్వంటే సాక్షాత్తూ సరస్వతీదేవివి, గొప్పకుటుంబంలో పుట్టినదానివి, బ్రాహ్మణజన్మ—'

'ఎప్పుడూ మీకు చదువూ, పుస్తకాలే. నగలు నాణాలు చేయించిపెడతాననడంలేదు. చదువుకో, చదువుకో, చదువుకో!'

'నోరుముయ్.'

'అసలు నేచెప్పవచ్చేమాట వినండి. ఎంతవిచిత్రమమ్మా!'

'ఏమిటావిచిత్రం?'

'కూరెళ్ళవారిచిట్టెమ్మ మరేమోనే కాలిమీద కడియం కింద కురుపేసిందని కాలికడియం తీయించేసుకుంది!'

'అదీ విచిత్రమే! అయితే కురుపేసినా కడియం తీసెయ్య కూడదంటావు.'

'ఇంకా నెమ్మదిగా అంటారు. కాలుకింద కురుపేస్తే కడియం తీసేస్తారా! ఎంతశోద్యం! మాలాటివాళ్ళు కాలుపోయినాసరే కడియంతీస్తారూ?'

'నీబుద్ధి అందరికీరమ్మంటే వస్తుందా?'

'వెటకారాని కేమిటిలెండి. మాఅమ్మకికూడా వోకమాటిలాగే కాలిమీద కురుపేసింది. ఏవైద్యుడొచ్చి చెప్పినా- అదేమిటో వీళ్ళమ్మకడుపుకాలిపోనూ-కడియంతీసేస్తేగానికురుపు తగ్గదనేవాడు. అలాగనేటప్పటికి మాఅమ్మ మండిపడిపోయి నానాతిట్లుతిట్టేసేది వాళ్ళని. ఆఖరికి పెద్దాసుపత్రికి వెళ్ళేటప్పటికి

అక్కడిదొరసాని నలుగురిని మాఅమ్మని గట్టిగా పట్టుకొమ్మని చెప్పి ఆమట్టుగ కడియం తీయించేసింది దానిల్లు మాసిపోను. మాఅమ్మ యెంతేనా గుంజులాడింది, తిట్టింది, కేక లేసింది, యేడ్చింది, వొకంతట తియ్యనిచ్చిదనుకున్నా రేమిటి. తెలివీ తేటా లేని మొద్దుకాబట్టి ఆదొరసాని కడియంతీసేసింది.

'నీ తెలివి తేటలు ఇంతవరకూ భూమిమీద పుట్టినవాళ్ళలో లేవు. అది నిశ్చయం.'

'సరేలెండి. ఇంకా ఈసంగతి వినండి, అంతకంటే తమాషాగాఉంటుంది. ముక్కుమీద వేలేసుకుని అలాగే వుండిపోతారు.'

'అబ్బా! ఏదీ చెప్పు చూదాం!'

'జానికమ్మగారికి కళ్ళగపడవు.'

'ఊఁ.'

'పోనీ కళ్ళగపడనిమనిషి యింట్లోకూచోవాలా. అలాగ కూచోకుండా కళ్ళజోడెట్టుకుని వూరల్లా తిరుగుతూంది! ఎంత ఆశ్రియమో!'

'అదీ తప్పే!'

'మీదంతా అదోతంతు. నాకు తెలియనే తెలుసులెండి. బోడివాళ్ళని పెళ్ళిచేసుకోమనేసజ్జు మీదంతా. మాఅన్నయ్యకీ ఇలాంటిదే పుట్టింది.'

'నోరుమూసుకో.'

'నాకెందుకుగాని, అన్నపూర్ణ కాళ్ళకి జోడుతొడుక్కుని, గొడుగువేసుకొని స్కూలుకెళ్తుతూంది. విన్నారా యీసంగతి.'

'అయితే, యెండలో వెళ్ళేటప్పు డేంచేస్తుందీ!'

'పరువుమర్యాదున్నవాళ్ళుజోడుతొడుక్కుంటారా, గొడుగు

వేసుకుంటారా! ఎండ మండిపోతున్నాసరే, జోరున వానకురి సేస్తూన్నాసరే యెండుతూ తడుస్తూ వెళతారుగాని గొడుగు వేసుకుంటారా!'

'నీ తెలివి తేటలకి నే నెప్పుడూ సంతోషిస్తూనేఉన్నా ...... ఔనుగాని, నేను నిన్ను మనదేశవుగుడ్డ కట్టుకొమ్మని చెప్పలే?'

'ఆగోనెగుడ్డలు నే మొయ్యలేను బాబూ. అవి బరువు.'

'నీకు బరువా, మొయ్యలేవూ? ఉఁడఁ.'

'ఊరికే వేళాకోళా లాడుకుంటూను.'

'ఇంకముందవేకట్టుకోవాలి, తెలిసిందా. నేను ఊరుకునే వాణ్ణికాను.'

'అలాగేలెండి. ఔనుగాని దేశనాయకులంతా చచ్చిపోయారు టేమిటి!'

'నీఇల్లు వల్లకాడుగాను, అలాంటిదికూడా తెచ్చిపెట్టకు. తెలియనిదానివి తెలియనట్టుగానేనా పడిఉండవు, నీకదో పెద్దరోగం.'

'నేనన్నమాటనుకున్నారేమిటది. ఆడవాళ్ళంతా కూచుని చెప్పుకున్నారమ్మా. అందరు దేశనాయకులు పదిపన్నెండు మందిట, ఒకయెద్దుబండీలో వెళుతూవుంటే ఆబండీ తిరగబడి సముద్రంలో పడిపోయిందిట. అందరూ చచ్చి—'

'ఇంక నోరుముయ్యి, పాడు తెలివితేటలు కనపరచక, చదువు రానివుల్లమ్మా, యెల్లమ్మా కబుర్లకికూచుంటే ఇలాంటివికాకపోతే మరేలాంటివి పుడతాయి. కాలక్షేప మవడమెలాగ పశువులికి.'

'ఆగొడవలు నాకెందుకుగాని ... ... సరేలెండి. చంద్రహారా లెప్పుడు చేయిస్తారూ? ఈమాటొచ్చినజీతంలో నొక్క దమ్మిడీ ఖర్చుపెట్ట వల్లకాదు.'

'ఉఁ. భోజనం మానేశయ్యి.'

'ఎంతసేపూ నేను తినేస్తున్నాననేకదా మీ—'

'నేను మానెయ్యలేను.'

'భోజనం మానేసుకోవాలేమిటి వస్తువుచేయించుకోడానికి.'

'అయితే ఈనెలజీతంలో భీమాకు పోతుంది కొంత.'

'భీమాగీమా అవతలపెట్టండి. ఈపాటికి భీమాలు చాలించండి. భీమాలకి కడితే ఆయుక్షీణంట! మానాన్న చెప్పేవాడు. ఎందుకొచ్చినభీమా లివి.'

'నీకు తెలియనిసంగతులు అడిగితెలుసుకోరాదూ. ఆపాగ రెందుకూ?'

'మీ రెన్నన్నాసరే ఈ నెలజీతం ఖర్చుపెట్టవాటంకాదు.'

'చూద్దాంలే.'

'అలాగేలెండి.'

ॐ

'మనింట్లోకూడా యెలట్రీ పెట్టించుగుంటే బాగుంటుంది.'

'ఏమిటదీ! మళ్ళాచెప్పూ!'

'ఏమిటో.'

'ఎలట్రీఅంటే యేమిటో!'

'నాకు తెలియదుపొండి.'

'నువ్వుచెప్పేది క్రొత్తపేరు. ఇంతవరకూ వినలేదు. అందరినీ యింకముందు ఈపేరే వాడమని చెప్తా.'

'అయితే దాని నేమంటారు?'

'ఇంతవరకూ ఎలక్ట్రిక్ అంటున్నారుమరి.'

'ఎలక్సిక్-అదేనా మీరనేది. ఈమాత్రానికేనా యేదో పెద్దమహాభాగ్యంగాచెప్పొగొచ్చారు. ఎలసిక్,ఎలసిక్,ఎలసిక్.'

'తొందరపడకూ. ఎలక్ట్రిక్, ఎల్రసిక్ కాదు.'

'అయితే అదేఅనుకోండి. ఇంగ్లీషుముక్కలంతా ఇంతే. పాడుముక్కలు.'

'నీకు రానివన్నీ పాడువే.'

'అయితే యింతకీ యెల్రటిక్ అంటే వొకనూనా యేమిటీ? ఆతీగలో గొట్టంలోంచి అది వెళుతూఉంటుంది. అంతేనా?'

'నీకు తెలిసింది అంతే.'

'మరయితే అదేమిటి?'

'ఆదొకశక్తి. అది ప్రవహిస్తుం దాతీగలోంచి.'

'శక్తి! అమ్మవారున్నూ! నిజంచెప్పండి వింటా!'

'దాన్నేశక్తి అంటారు. అది తీగలోంచి వెళుతుంది.'

'తీగలో గొట్టం లేందే యెలా వెళుతుంది?'

'గరిటె వొకచివర నిప్పుల్లోపెడితే రెండోచివరికి యెలాగ వేడి వెళుతుందో అలాగే ఇదీ వెళుతుంది.'

'అదా, అయితే తెలిసింది. అదేఅన్నమాట అలా వెలుగు తుంది. అది మనయింట్లోకూడా పెట్టించుకుంటే బాగా వుంటుంది.'

'అది ఇంట్లోపెట్టించుగోటం అట్టే మంచిదికాదు. దృష్టి చెడిపోతుంది, కళ్ళుపోతాయి. వీధుల్లో అయితే ఫర్వాలేదు. దానివల్ల చెడ్డలేదు.'

'ఏమో. చూడడానికి బాగుంటుంది ......... సరేగాని మీరు ఆంధ్రపత్రిక చదువుతున్నారు. నేనుకూడా నిన్న చదివాను. దాంట్లో శాసనసభల్ని గురించి యేదో రాసివుంది. శాసన సభలంటే యేమిటీ?'

'శాసనసభలంటే అందులో అనేకమంది వుంటారు. వాళ్లంతా

దేశంలో అవసరమైన ఒక్కొక్క విషయాన్ని గురించి ఆలోచిస్తారు.

'అంటే అక్కడ యెవరెవరుంటారు?'

'అంతా సభ్యు లుంటారు.'

'అంటే ?'

'పోనీ దాన్నిగురించి నీ కెంతమట్టుకు తెలుసో చెప్పు. మిగిలిందంతా చెప్తాను.'

'నాకస లదేమిటో తెలీదు.'

'అదంతా నీ కిప్పుడు నేను చెప్పలేను.'

'పోనీండికాని వీరేశలింగం, వీరేశలింగం అంటారుకదా. ఆయన యెవరు, కంసాలా, కాపా ?'

'నీకు తెలివి యెంతమట్టుకుందో నాకు స్పష్టంగా తెలుస్తూంది. వీరేశలింగం కంసాలి !'

'ఆక్షేపించకపోతే చెప్పరాదూ ?'

'నువ్వే చెప్పేశావుగా.'

'పోనీ చెప్పండిమరి.'

'ఆయన మొదట బ్రాహ్మడు, తర్వాత బ్రహ్మ అయాడు.'

'బాగా చెప్పండి.'

'బ్రహ్మఅంటే నీ కెంతమట్టుకు తెలుసో చెప్పు. తక్కిందంతా చెప్తాను.'

'నా కసలు తెలియందే.'

'నే నిప్పుడు చెప్పలేను. నీకు అన్నిటినిగురించీ 'ఓనమః' లదగ్గరనుంచి చెప్పకురావాలి. నీ కేమేనా అక్షరాలొస్తే పుస్తకాలిస్తాను చదువుకో. నాకు వోపికాలేదు, తీరికా లేదు.'

(తనలో) 'నయమే! మళ్లా చదువులోకి దిగారు. ఇంక నోరుమూసుగుంటే మంచిది.'

౬

'ఏమండోయి!'

'ఊఁ.'

'మళ్లీ సోమవారం చంద్రగ్రహణంట. మా అమ్మ రాసింది. నానక్షత్రాన్ని చంద్రగ్రహణం పడుతూందనీ, అంచేత నేను చంద్రగ్రహణం చూడకూడదనీ, బ్రాహ్మడికి కొత్తమానెడు సోలెడు బియ్యం, ఏదేనా కూరా యిచ్చుకోవాలనీ రాసింది. ఆరాత్రి మడివూరగాయలమీద దర్భకర్ర పడేసుకోవాలి. ఓ రాత్రివేళ మీ రెలా స్నానంచేస్తారో ఏమిటో!'

'నేను స్నానంచెయ్యకపోవడం సరేకదా నిన్ను కూడా స్నానంచెయ్యనియ్యను. తెలిసిందా. నీ కెన్నిమార్లు చెప్పినా బుద్ధిలేకుండావుంది. గ్రహణమంటే యేమిటో డెబ్భైయైదుసార్లు చెప్పాను.'

'అయితే ముసిలాళ్లకంటే మీ కెక్కువ తెలుసాయేమిటి?'

'ముసిలాళ్లకు తెలివితేట లేడవలేదని చెప్పలేదూ?'

'ఎప్పటిసంగతికో యిప్పుడు దెబ్బలాడుకోడమెందుకులెండి ... ఇదేమిటీ! సోమవారంపూటా కొత్తబట్ట కట్టుకున్నారేమిటీ! అయ్యో! అయ్యో! నే నేంచేతునమ్మో!'

'కొత్తబట్టలు కట్టుకోకూడదూ?'

'వారం వర్జం లేదూ!'

'నీ తెలివితేటలు తగ్గించుకో, మ రేంతప్పిదంలేదు.'

'మీఖర్మం. నేను చెప్పనేచెప్పానుగా వెధవముండలకి పై——.'

'నోరుముయ్.'

'... ... ... ... ... ...'

'... ... ... ... ... ...'

'ఇదేమిటిది ??

'మీా రెండుకులెండి.'

'అలాగుకాదు.'

'విడువను.'

'చిరిగిపోతుంది.'

'దాంట్లో మరేంరహస్యాలు లేవు, చదువుకోండి.'

'ఎవరికి రాశావూ ?'

'మాఅమ్మకి.'

'పైవిలాసమూ ఇది !'

'ఊఁ'

'నీకు బుద్ధీ జ్ఞానముందా. ఈ వుత్తరం యేజన్మానికేనా మీానాన్నకి జేరుతుందా. నరేడ్ల అనడానికి నరేళ్ల అనిరాశావూ, పైగా విశ్వనాథశాస్త్రికి అనడానికి పిసినాధశాస్రి అన్నావూ.'

'మాఅమ్మదగ్గిరనుంచి తెచ్చుకున్నకార్డు అయిపోయాయి. మిమ్మల్ని యెడ్రెసురాసిపెట్టండంటే ఉత్తరమంతా దిద్దుబాట్లే, అనహ్యామేస్తూ. అంచేత నేనే రాసుకున్నా.'

'చిరునామా యేమిటి రాశావూ... ... ...బమ్రసీ నరెళ్ల పిసినాధశాస్త్రిగారికి అనేకనమస్కారములు, కాకినాడ రవానా గుడిపీధి కాకినాడ కాకినాడ కాకినాడ గుడిపీధి నరెళ్ల పిసినాధ శాస్త్రిగారికి కిచ్చేయువలెను కాకినాడ—యింక స్థలం లేదూ రాయడానికి ?'

'ఆక్షేపణలకి మొదలు.'

'తప్పులు చెప్పితే ఆక్షేపణలు, ఊరుకుంటే ఉత్తమమునా,

చిరునామా రాసేమో స్తరిదేనా! ఉత్తరంలో యింకా యెన్ని తప్పు లున్నాయో! (ఉత్తరం లాక్కుంటుంది) నీఖర్మం నేనేం చెయ్యనూ.'

'ఈ మొగాళ్లకి చదువు రావడం చాలాకష్టంగాఉందమ్మా.'

'అంతేకాని నువ్వుకూడా చదువుకుందామని నీమట్టుకు తోచదు.'

౭

'ఇదిగో!'

'ఊఁ.'

'తమలపాకులు మహాపసందుగా రాశావు కాని యేదీ మూల పడివున్న హార్మోనియం ముందుకులాగి- నువ్వేదో మూడునాళ్లు సంగీతగీతం వెలిగించావుట, ఎలాగుంటుందో యెప్పుడూ విన లేదు,మా మామగారు నీపాటను మహామెచ్చుకుంటూవుంటాడు, నువ్వు పాడుతూవుంటే కిన్నెరలు మోగిపోతూవుంటాయంటాడు. ఏదీ వొక్కమాటు వొక్కకృతి.'

'నాకు రాదు.'

'కాను! నాకు తెలుసు నీబెట్టుసరి. ఎంత బతిమాలించు కుంటే అంతసరదా నీకు!'

'మీా రేమనుకున్నాసరే.'

'ఒక్కమారు పాడుదూ.'

'నాకు రాదంటేనే.'

'మంచిదానివిగా పాడూ.'

'... ... ... ... ... ...'

'పాడు మరి.'

'... ... ... ... ... ...'

'పాడమంటూవుంటే.'

'మీకు సిగ్గులేదు.'

'ఎందుకూ సిగ్గు. అయితే తొందుకు సంగీతం నేర్చుకోడం.'

'... ... ... ... ... ...'

'పాడమంటే.'

'... ... ... ... ...'

'నాకు కోపం తెప్పించకుమరి.'

'... ... ... ... ... ...'

'ఊరుకున్నంతసేపే నేను మంచివాణ్ణి.'

'... ... ... ... ... ...'

'నామంచితనం చూడడంలేదు నువ్వు.'

'... ... ... ... ... ...'

'పాడవూ అయితే.'

'... ... ... ... ... ...'

'పాడవూ.'

'... ... ... ... ... ...'

'ఇదిగో! నేను నాస్నేహితుడు వెంకటావ్వింటికి వెళ్ళిపోతున్నా. ఇవాళరాత్రక్కడే పడక. నీయేడుపు నువ్వేడవాలి.'

'నే నొక్కర్తెనూ వుండలేను. నాకు భయం.'

'ఏడిశావు.'

'పాడతానండీ.'

'నోరుముయ్!'



# * సామాన్య దంపతులు

౧

"తలుపుతియ్యి !"

"వస్తున్నా "

"(కోపంతో) ఇంకా ఎంతసేపు వస్తున్నావూ. తలుపు తియ్యంటూవుంటేనే !"

"(తలుపుతీసి) పిల్లాడు చాటలోవున్న పిండి కింద పారపోస్తున్నాడు. అది దాచి వచ్చాను."

"ఏడవలేక పోయావు, నీ తెలివితగలడ. ఆఫీసులో చచ్చి చచ్చి ఇంటికివస్తే ఇంటిదగ్గరా మళ్ళీచావడమే... ఇక్కడ దీప మెక్కడ పెట్టావు. నన్ను చంపుకుతినేస్తున్నావునువ్వు. బతికుండగా కాల్చేస్తున్నావు."

"దీపంవత్తి అయిపోయింది. అంచేత అది ఇక్కడికి తీసుగొచ్చి పెట్టాను."

"నీశార్థం. దీపంవత్తి అయిపోయిందో లేదో మొదట చూసుకుని తగలడొద్దూ. నీఅమ్మ కడుపు మాడిరి. ఇలా తగలపెట్టూ ఆదీపం."

"పెడుతున్నా"

"ఏంపెడుతున్నావు, పెట్టితగలడ మంటూంటేనే. నన్ను కాల్చుకు తినడానికి పుట్టావునువ్వు. వొద్దువొద్దోయ్ అంటూ వుంటే నిన్ను పెళ్ళిచేశాడు మానాన్న. (మంచంమీద పడుక్కుంటాడు) ప్రాణా లెగిరిపోతున్నాయి. కాళ్లు లాక్కుపోతు

---

*ఈ రచన 1934 లో రచించిరి.

జయంతి ౧ వ సం. 9 వ సంచికలో (ఏప్రిల్ మే 1936)

న్నాయి. రోజూ ఇంతే రోజూఇంతే, అక్కడా ఇక్కడాకూడా."

"భోజనానికి లేవండి తింటే కడుపులో చల్లగా వుంటుంది."

"ఏడిసిన వెధవదయ ఇదోరకం కాల్చుకు తినడం కమాసు వాతమీద వేణ్ణీళ్ళు పోసినట్టు."

"భోంచెయ్యమన్నా తప్పే!"

"ఇంక నోరుమూసుకో, వొళ్లు వాయకొట్టాను."

"దెబ్బలకేం లోటూ."

"ఏమిటీ!"

"ఏం లేదు."

"ఏమిటో సణుగుతున్నావులే, మహా. ఇదిగో ఇప్పుడే చెప్తున్నా. నాదగ్గిర తిన్నగా బతకదలచుకుంటే నన్నేమనొద్దు తెలిసిందా మరీ, మరీ చెబుతున్నా ఆతర్వాత నన్నేమనొద్దు."

"ఆలాగే"

"ఏడిశావ్!"

"(తనలో) సంధ్యవేళ అవుతూందంటే ఒళ్ళు గజగజలాడి పోతుంది, తినడానికి పెద్దపులివస్తుందా అన్నట్టు. సాయంత్రమైతే నరి గుండెల్లో దడపుట్టుకొస్తుంది"

౨

"ఏదో ఇంత పిండాకూడు పెట్టు."

"... ... ... ... ... ..."

"వేగిరం యేదో వడేసెయ్యి, తిని యేడుస్తా"

"వడ్డన అయింది"

"(కలుపుకుంటూ ఉంటే నెయ్యి వడ్డిస్తుంది) నెయ్యి కాచి యేడవకలేక పోయావూ?"

"నిప్పులార్పేకాక జ్ఞాపకమొచ్చింది నెయ్యిమాట. వేడి

అన్నమేగనక వేసుగోండి."

"ఏదో తగలెయ్యి."

"... ... ... ..."

"పప్పులో ఉప్పెక్కువ పారేశావేం. నాకంత తిండి పెట్టడం కష్టంగావుంటే నేను వండనని చెప్పరాదూ. నేనివాళ భోం చెయ్యను."

"కూచోండీ !"

"వెళ్ళి ... ... ..."

"అప్పుడే వీధిలోకే వెళ్ళి పోయారు. నాకూ ఉపోషమే ఇవాళ. మనిషి నోరెత్తితే పువ్వుల్లాంటి మాటలాడరాదు. మనస్సు రాయి అయిపోతూంది. నాఖర్మ మేమిటోగాని."

3

"పిల్లాడికి శైత్య మెందుకుచేసింది ?"

"ఏమో !"

"నిన్న వానలో ఆడేడేమిటి ?"

"నేను చూస్తూనేఉన్నా ఆడలేదు."

"ఆడకపోతే శైత్యమెందుకు చేసింది ?"

"ఏమో ! నేను బియ్యం బాగుచేసుకుంటూ ఉంటే, వాడు అవతలివేపుకి వెళ్ళాడు. వెంటనే ఇంట్లోకి తీసుకొచ్చాను."

"అదుగో అలాగ చెప్పు. నీ తెలివి తేటలు కాలినట్టే వున్నాయి, వెధవ తెలివి."

"ఎంతకని కనిపెట్టుకుకూచోను, ఇంటి పనులు చేసుకోవాలా వద్దా ? బియ్యం బాగుచేస్తూవుంటే వాడలా పరుగెత్తుకెళ్ళాడు."

"దరిద్రగొట్టు వెధవా ! యని అందుకే నే నేడుస్తున్నా."

౪

" నేనివాళ నాటకానికి వెళ్ళాలి. వేగిరం తిండిపెట్టు. "

" నన్నుకూడా తీసికెళతారా ? "

" ఎవడో పెళ్ళి కెళుతూ పిల్లిని చంకనెట్టు కెళ్ళాడుట, "

" మాఊళ్ళో పూతమ్మడు నాటకానికి తీసుకెళ్ళడమే కాని ఈఊళ్లో వెళ్ళేలేదు. "

" మీఊళ్లో నాటకంలాగే ఉంటుంది ఈ ఊళ్లో నాటకం కూడా. "

" వెనక మీరు చూసిన నాటకాలలాగే ఉంటుంది, ఈ నాటకంకూడా. "

" అలాగ మాటకి మాట అంటేనే నీబతుకు బద్దలవుతుంది."

" అయితే నోటంబడిమాటే రాకూడదేమిటి. "

" నేనున్నంతసేపూ రాకూడదు. చేత్తో నోరుమూసుకుని వుండాలి.. కావలిస్తే నేను వెళ్ళాక పెంకు లెగిరిపోయేటట్లా అరువు. "

" నాకేంపట్టింది అలాఅరవడానికి. నేను నింపాదిగానే మాట్లాడుతూ వుంటాను. "

" అయితే నేనేనా పెంకు లెగిరిపోయేటట్లా అరుస్తూ ఉంటాను. "

" నేనన్నానేమిటి ఆమాట. మీరు చిరాకుగా గట్టిగా మాట్లా డుతూఉంటారుగాని. "

" ఏదో నాకెందుకీవెధవగోల, ఏదోపడేసెయ్యి, నోరుమూ సుగు తిని పోతాను. "

" (తనలో) సరసంగా మాట్లాడితే కొట్టొస్తారమ్మా నాబతు కాలా. "

౫

" ఇందాకల్లా ఎవరూ మీకోసం వచ్చారు ? "

" మనుష్యులే, రాక్షసులుకాదు. "

" ఊరికే అడుగుతున్నా ఎవరని. "

" యమధర్మరాజు. "

"..................."

" నేనలాగు పోవాలి తలుపు వేసుగో. "

" ఎక్కడికి కెళతారు. "

" ఎక్కడికెళితే నీకెందుకూ, తిరిగి వస్తానో రానోఅనా. తిరిగిరాకపోతేనే సుఖంగాఉంటుంది నీకు.

౬

" అద్దం ఎందుకూ బద్దలయిందీ. "

"..................."

" చెప్పూ చెప్పవేం. "

"..................."

" చెప్తావా చెప్పవా ? "

" పిల్లవాడు చేతిలోదిలాక్కునికిందపడేశాడు "

" పిల్లవాడికద్దమెందుకిచ్చావు ? "

" నేనియ్యలేదు. "

" నేను తల దువ్వుకుంటూఉంటే వాడు తీసుకుని " ఇచ్చెయ్యి " అంటూ ఉంటే కిందపడేశాడు. "

" ఇంతపనికిమాలిన దానివయితే నువ్వెందుకు పనికొస్తావు. "

౭

" ఇక్కడపెట్టుకున్న అరటిపళ్ళు ఎవరు తీశారు ? "

" నేను. "

"ఏంచేశావు."

"అదిగో ఆరింట్లోనూ వొకటి తిన్నాను. తక్కినఅయిదూ ఇక్కడ దాచాను."

"నేను అసలు నిన్ను ఆవళ్లు ముట్టుగోమన్నానా?"

"... ... ... ..."

"చెప్పూ, చెప్పవేం."

"లేదు."

"మొదటి తప్పు నన్నడగకుండా పళ్ళు ముట్టుకోడం. రెండో తప్పు నేను నాకోసమని తెచ్చుకొన్న పళ్ళు తినేసెయ్యడం."

"అదిగో అయిదు పళ్ళున్నాయి."

"అయిదు పళ్ళున్నాయి. నువ్వూఉన్నావు. నేను తిందామని ఆప్యాయంగా తెచ్చుకొన్నపళ్లు నువ్వెందుకు తినేశావు?"

"నాకు తెలియలేదు మీరుతిందామని తెచ్చుకున్నారని"

"నేను చచ్చాక తెలుస్తుందాయేమిటి నీకు" (కొడతాడు)

ర

"ఇదిగో బజారు కెళ్తున్నా. నీకేమేనా కావాలేమోచెప్పు కొనితెస్తా."

"నాకేమక్కర్లేదు"

"అయినా చెప్పు, కొనితెస్తా."

"నాకక్కర్లేందే."

"నేనుముచ్చటగా అడుగుతున్నా, కొనితెస్తా చెప్పు."

"తర్వాతనన్ను దెప్పి చంపడానికి, నాకేమీ అక్కర్లేదో యంటూఉంటేనే."

"నీఖర్మం నేనేంచేసేది. వెనకేదో రవికెలగుడ్డ కావాలన్నావు కాదూ."

"నాకు కావాలసినన్ని రవికెలున్నాయి. అక్కర్లేదు."

"నువ్వు కొయ్యపోతుమనిషివి. నిన్నుఅడగడం నాదే బుద్ధి పొరపాటు. లెంపలువాయించుకుంటున్నా. (లెంపలు వాయించుకొని వెళ్ళిపోతాడు.)

## అన్యోన్య దంపతులు

౧

"ఓయ్! తలుపుతియ్యి!"

"వచ్చె"

"............"

"(తలుపుతీసి) పిల్లాడు చాటలోపిండి కిందపారపోస్తున్నాడు. అదితీసి దాచివచ్చాను."

"అంత పెంకితనం చేస్తున్నాడూ!"

"అంతా యింతానా!"

"అయితే శిక్షవేస్తాను."

"ఏం శిక్షవేస్తారు?"

"చూద్దూగానిగా."

"అయినా చెప్పండి"

"వాడిచేత నిన్ను నాలుగు తన్నిస్తాను."

"మంచిశిక్షే! పోనీ మీరు తినండి."

"నేనుతిన్నా నువ్వుతిన్నా ఒకటేగా!"

"అంచేతే మీరుతినడం."

" అందుకే నువ్వతినడం……ఏడీ తండ్రేడీ, వెఱితండ్రి [పిల్లవాణ్ణితీసుకుని] ఇదేమిటే అసహ్యంగా వున్నాడు."

" ఇవాళ తలదువ్వి మొహంకడగలేదు."

" ఎప్పుడూ పిల్లాణ్ణి అశుభ్రంగావుంచకు. నాకసహ్యం. [మంచంమీాద పడుక్కుంటాడు]."

" ఏమండీ మరి మా అమ్మదగ్గిర నుంచి ఉత్తరం—"

" ఇప్పుడు నన్నేమీా మాట్లాడించకు. ఆఫీసునుంచి వచ్చాక కాస్సేపు ఊరికే పడుక్కుంటేగాని ఒళ్లూ, మనసూ స్థిమితపడవు. భోంచేశాక కావలసినన్ని అడుగు చెప్తాను."

" అలాగే."

౨

" ఆఫీసువేళయిపోయింది, వేగిరం వడ్డించు."

" మొదట మీారు భోంచేశాక నేను దేవుడికి నైవేద్యం పెట్టుకుంటా, రండి"

" నావంతు నేను నైవేద్యం పెట్టుకుంటా, నీవంతు నువ్వు పెట్టుకో."

" (వడ్డిస్తుంది) కూచోండి."

" (తిని) పప్పులో ఉప్పెక్కువయింది,"

" ఎంత జాగ్రత్తగా చేసినా ఏదోవొకటి వస్తూనేఉంటుం దమ్మా"

" ఏదో పొరపాటురాకుండా పనులు జరుగుతాయేమిటి."

" రేపటినుంచి తక్కువ పారేస్తూఉంటాను."

" ఊఁ."

" …………… "

" ఏదీ ఆధరువులు మరి రెండు చేశావు కావేం. రెండు ఒకటి

చెయ్యకపోయినా, ఒకటి రెండుచేస్తూ ఉండు. ఇలాగ వంకాయి కూర చేసినప్పుడు అందులోదే కొంతతీసి పెరుగుపచ్చడో, పులుసు పచ్చడో చేస్తూఉండు. పొట్లకాయకూర చేసినప్పుడు అందులోదే కాస్తతీసి పెరుగుపచ్చడి చేస్తూఉండు. పిండ్లన్నీ చేసి ఉంచమన్నానే. పెసరపిండి, మినపపిండి, సెనగపిండి ఇలాంటివి. సులువుగా పచ్చళ్ళు చేసుకుంటూ ఉండొచ్చు. మన తెలుగు వాళ్ళతిండి అసలే బలహీనమయింది, తక్కిన దేశస్థులందరి తిండి లాగాగాక, అందులో ఇలాంటివికూడా లేకపోతే ఇంక చెప్పే దేమిటి.''

''అలాగే చేస్తానులెండి. దేనికయినా పిల్లాడొకడు అడ్డొస్తూఉంటాడు.''

''మడి మడి అని గింజుకోకుండా ఉంటేసరి. పిల్లాడు అడ్డొచ్చినా ఫర్వాలేదు. పిల్లాడు మధ్యాన్నం పడుక్కున్నప్పుడు ఇలాంటివి చేసుకోవచ్చు. మడి ఏడవకపోతే, ఇలాంటివన్నీ ఇట్టే జరుగుతాయి.''

''ఊఁ.''

''మజ్జిగ పోసెయ్యి పోవాలి.''

3

''పిల్లాడికి శైత్యంచేసిందేం?''

''ఏమో!''

''వానలో తిరిగా డేమిటి.''

''నేనేదో పనిచేసుకుంటూంటే, వాడు వీధిలోకి పరిగెత్తాడు, అప్పటికీ వెంటనే తీసుకొచ్చాను.''

''మంచిపనే. కొంచెం జాగ్రత్తగాచూడు. శైత్యం తగ్గేవరకూ అశ్రద్ధ చెయ్యకు. జబ్బులోకి దింపేను.''

"అలాగే"

"... ... ... ..."

"ఉత్తపుణ్యానికి ఎదుటింటి ఆవిడ నన్ను తిట్టడం మొదలెట్టిందండీ."

"ఎందుకూ ?"

"ఏమో !"

"కారణం లేకుండా తిడుతుం దేమిటి."

"ఉత్తపుణ్యాని కంటూంటేనే."

"అయితే నువ్వేంచేశావు. నువ్వూ తెగతిట్టావా ?"

"తిట్టనూ ! తిట్టక ముద్దిస్తానేమిటి ?"

"అయితే నీబుద్ధేం మహాఇదయి పోయిందని చెప్ప వచ్చావు" కారణం లేకుండా తిడుతూంటే ఎలాగ ఊరుకోనండీ ! నేనూ పడతిట్టాను.

"కారణం లేకుండా తిట్టినప్పుడు, నిన్ను కాదని ఊరుకోవద్దూ. నువ్వు ఊరుకుంటే ఆవిడ ఎంతసేపు తిడుతుంది ?"

"ఎంతసేపేమిటి ఆడదానికి."

"ఊరికే గొడ్డులాడులా అరిస్తే నలుగురూ ఆవిడనోట్లోనే గడ్డి పెడతారు."

"అదేమిటండి అలాగంటారు."

"అయితే నన్నుకూడా అందుకుని ఆవిడతో జగడమాడ మన్నావేమటి."

"లేకపోతే ఎలాగండీ."

"చాలా బుద్ధిమంతురాలివే. ఇంకేం చాలా బాగుంది, నీకు బుద్ధిలేకపోగా నాకు కూడా ఉండకూడదంటావు. అంతేనా నువ్వనేది."

" మీరు ఊరుకుంటే ఎలాగండీ, నన్ను ఉత్తపుణ్యానికి తిడితేనే "

" నేను చెప్పనేచెప్పానుగా. ఊరుకుంటే మరింక తిట్టదని. "

" మంచి సలహాయే చెప్పారు. "

" అయినా ఈమారు చేసి చూద్దూ, నా మాటవిని "

" అదీ చూద్దురుగానిగా. "

" ఆఁ చూస్తాను. "

౪

" ఇదిగో ! "

" ఊఁ. "

" ఇవాళ నాటకానికి వెళ్ళాలి. "

" నేనలాగ స్వతంత్రించి చెప్పగలనా, మీ అనుజ్ఞ తీసుకోవాలి, అప్పుడు వెళ్ళాలి. "

" అంటే నువ్వనడం, నీఅనుజ్ఞ తీసుకుని నన్ను వెళ్ళమనా, లేక నాకుచెప్పకుండా నువ్వు నాటకాలికి వెళ్ళకూడదా అనా."

" అదీకాదు, ఇదీకాదు. "

" మరి. "

" మరి నన్నుకూడా నాటకానికి తీసుకువెళ్ళమని. "

" దానికేనా అలాగన్నావు. "

" అలాగనకపోతే తీసికెళతారా ?"

" తీసికెళతానో లేదో మరి నిలిచిచూశావుకాదు. "

" ఈ ఒక్కమాటేనా నిలిచిచూడనిది. "

" అలాగంటేనే నాకు ఒళ్లుమండుకొస్తుంది. ఇంక అనరే తీసికెళ్ళను. "

" లేదులెండి ఊరికే అన్నా. "

"వేగిరం పనులుచేసుకో మరి, పోదాం."

"ఊc, నిమిషాలమీద . . . . . ఊళ్ళో విశేషాలేమిటండీ."

"ఏం చెప్పమన్నావు కవి సన్మానా లెక్కువయిపోతున్నాయి"

"కవయిత్రి సన్మానాలుకూడా ఉన్నాయా?"

"కవయిత్రులుంటే ఉండకేం."

"మొగాళ్లు ఉండనిస్తారా. ఆడాళ్లు చదువుకోకూడదుకా"

"మీనాన్న చదువుచెప్పిస్తే నువ్వెంతదానివేనా అవుదువు."

"నాకు చదువూవద్దు చట్టుబండలూ వద్దు. అన్నీ మీరే—"

"ఇప్పుడంతే అయిపోయిందిలే."

"అసలు ఎప్పుడేనా అంతే అవడమే కోరుకుంటాను."

"మరి కవయిత్రులో."

"నేనవకపోతే మునిగిపోయిందేమిటి లెండి. ఇప్పుడు చదువుకొన్న వాళ్లందరిసీ అవనిద్దురూ చాలు."

"ఔను!"

"ఊళ్ళో విశేషాలు చెప్పరూ."

"వేగిరం నాటకానికి తెమలాలి, రేపు చెప్తాను."

"ఊc."

❀

"ఎవరండీ మీకోసం వచ్చారు?"

"నేనూ అతనూ చిన్నప్పుడు ఒక్క క్లాసులోనే చదువుకున్నాం. ఇప్పుడతను ఇక్కడ కాలేజీలో లెక్చరర్ గా ఉంటున్నాడు. నెలకి రెండు వందల రూపాయిలు జీతం, అతనూ."

"అదృష్టవంతుడే."

"అందరూ నాలాగే ఉంటారేమిటి?"

" అలాగంటేనే నాకువొళ్ళు మండుకొస్తుంది. "

" లేదులే. ఇదిగో నేనలాగువెళ్ళాలి, పనివుంది. అర్జంటుగా వెళ్లాలి. "

" ఎక్కడికి వెళ్లాలి. "

" మా స్నేహితుడు సుబ్బారావుతో వస్తానని చెప్పాను. ఇద్దరంఏదో ఒకపని తలపెట్టాము. "

" ఏమిటో చెప్పండి. "

" నీచెవిని పడందే జరుగుతుందేమిటి ? తర్వాత చెప్తానులే తిరిగివచ్చి. "

" ఉఁ వెళ్ళిరండి. "

౬

" జ్వరం బాగానే ఉందండీ. అయినా చెయ్యి చూడండి. "

" (చూసి) ఏమంత ఉందిలే. అయినా వైద్యుడు మంచి మందు ఇస్తూనే ఉన్నాడు. "

" ఉత్తనే పక్కమీద పడుక్కుంటే ఏమీతోచకుండా ఉందండీ. ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూఉండేదాన్ని. కాళ్ళూ చేతులూ కట్టేసినట్టుగా పడుకోమంటే పడుకోగలనా ? "

" అలా పడుక్కుంటేనే జ్వరం తగ్గుతుంది. లేకపోతే వేగిరం తగ్గనే తగ్గదు. "

" మీరు ఇలాకూచోండి, కొంచెంసేపు కూచునివెళుదురు గాని. "

" ఉఁ (కూచుంటాడు.) "

" ఏమండోయి ! మొన్న నీమధ్య ఎదుటింటావిడ మళ్ళీ తిట్టడం మొదలెట్టిందండీ. "

" నువేం చేశావ్ ? "

" మీరు చెప్పినట్లే ఊరుకున్నాను, నామీద కారణ లేనప్పుడు నన్ను తిడుతూందనే అనుకోడ మెందుకని. "

" ఊఁ. "

" నలుగురూ నోట్లోగడ్డిపెట్టారు ఆవిడికి, ఉత్తపుణ్యాని కెం దుకు తిడతావమ్మా అని. "

" నేను చెప్పనే చెప్పానుకా. "

" ఔనుగాని నామీద కారణమున్నప్పుడు తిడితే ఏంచెయ్యా మన్నారు. "

" తెలియక తప్పుచేశానమ్మా. అవును నావల్ల తప్పొవొ చ్చిందమ్మా అనేసి ఊరుకోవాలి. "

" బాగానేవుంది. "

" మరి నేను వెళతాను, ఇంట్లో పనులుకూడా చేసుకోవాలి. "

" ఊరికే పడుక్కుంటే ఏమీతోచదండీ. చదువుకోకూడ దంటారు, పనులు చెయ్యకూడదంటారు. "

" దేవుణ్ణి స్మరిస్తూ పడుక్కో. దాంతో వూసుపోతుంది. "

" ఊఁ "

౭

" ఇక్కడ ఈఅద్దం బద్దలయి కిందబడిపోయిందేం "

" బల్లమీద ఉన్న తువ్వాలుతీస్తూఉంటే దానికిది తగులు కుంది కామోసు, కిందపడిపోయింది "

" కాళ్లలో పెంకులుగుచ్చుకుంటాయి. జాగ్రత్తగా తుడిచి అవతల పారపోసెయ్యి. ఆ అద్దంపోవడం మనస్సుకి కొంచెం విచారంగాఉంది సుమా. అద్దం పోయిందనికాదు. అదిపోతే మళ్ళీ అర్ధరూపాయిపెడితే మరోటి ఇట్టేవస్తుంది. అద్దంకోసమని కాదు. ఈఅద్దం నాలుగేళ్ళనుంచి ఉంది నాదగ్గిర. పరిచయ

దోషంవల్ల కొంచెం విచారంగా ఉంది. "

" నాకుకూడా అలాగే అనిపించిందండీ. '

" ............... "

" ............... "

" ఈ లాంతరుకి చిమ్నీ లేదేం. "

" చిమ్నీ తుడుస్తూఉంటే పిల్లాడు వెనకనుంచి చెయ్యి గెంటేశాడు, కిందపడి బద్దలయిపోయింది "

" ఇవాళకా రెండో లాంతరుతో కాలక్షేపంచెయ్యి. రేపు కొని తెస్తాను, "

" అలాగే. "

" నేను అరిటిపళ్లు తెచ్చిపెట్టాను, చూశావా ? "

" నేను రెండుతీసుకొన్నానండీ. "

" నీకూ నాకూ అనే ఆరుపళ్లు తెచ్చాను, మరో రెండు అన్నంలో వేసుకుందూగాని "

" నావంతు మూడింటిలో రెండయిపోయాయి. ఇక ఒకటే ఉంది "

" అయితే నావంతులో రెండు తీసుకో "

" ఇంక వంతనే దేముంది "

" అదే నేనుచెప్పడం. నీకు కావలసినవితీసుకో "

" ఇంకా ఎక్కువ తింటే ఏమేనా చేస్తుందిబాబూ. "

" అయితే వద్దులే. "

౮

" ఇదిగో నేనిప్పుడే చూశానింకా. ఇదిగో ఈ మల్లెతీగ చూశావూ రెండు మొగ్గలెట్టింది. "

" మీా కెక్కడ కనబడ్డాయండీ ! నేను రోజురోజూ దాని

ఆకులన్నీ వెతికిచూస్తానుకదా, నాకు కనపడలేదు.",

"నామాట అబద్ధమయితే ఇలా వచ్చిచూడు."

"ఇదిగో వస్తూన్నాను. [వెళ్ళిచూసి] ఔనండీ! బాగానే ఉన్నాయి. పిల్లాడు పుణికెయ్యకుండా ఉంటే అంచక్కా పువ్వు లవుతాయి,"

"వాడికి తప్పని చెప్పు పుణికెయ్యడు"

"తప్పనిచెప్పకే నేమిటి వాడుచేసేతప్పుపనులన్నీను, పోనీ ఆకులచాటునదాచు ఈ మొగ్గల్ని"

"అలాచేస్తే యింకామంచిది."

"మొన్న మంచిరకం గులాబీఅంట్లు తెచ్చియిస్తానన్నాడు. మా ఆఫీసు బంట్రోతు"

"పూలకుండ్లు ఉంటూవుంటే ఇల్లూ పెరడూకూడా ఎంతో అందంగా ఉంటాయిసుమండి"

"అందుకనే వెయ్యడం."

"మననిచూసి సూరమ్మగారు కూడా కుండ్లు తెప్పించి మొక్కలువేసింది."

"చూడడానికి అందంగాఉంటుంది."

"ఆవీధిలోఉండే అరవవాళ్ల ఇంట్లో యెన్నేనా కుండ్లు ఉన్నాయి సుమండీ."

"ఔను!"

"మరి నాలుగుకుండ్లు తెప్పించి, అక్కడక్కడ పెడతాను."

"తెప్పించు"

"ఏమిటండీ సంఘసంస్కరణ, సంఘ సంస్కరణ అంటూ ఉంటారు, నాకేమీ చెప్పరేం?"

"చెప్పడానికేముంది, చెయ్యడంలోవుందికాని"

"అయినా చెప్పుదురూ చూద్దాం"

"చెప్పినట్టు చేస్తావా చెప్తాను"

"మంచిదయితే చేస్తాను"

"మంచిదికాకపోతె నేనుమట్టుకి చెప్తానేమిటి?"

"అయితే చేస్తాను"

"వ్రతాలూ నోములూ చెయ్యడం మానమంటాను చేస్తావా?"

నేనైమానను.

"అయితే నేచెప్పేదేమిటి?"

"అలాంటివిచెప్తే ఎవరేనా చేస్తారేమిటి ఎక్కడేనా"

"అయితే ఎలాంటివి చెప్పాలి."

"ఎలాంటివీ లేదు."

"పోనీ వ్రతాలు, నోములలో ఉండే చెడ్డ చెప్తాను మానాస్తావా?"

"చెప్పండి చూతాం"

"విను అయితే"

"ఈవ్రతాలెందుకుకల్పించారో తెలుసానీకు"

"ఊఁ చెప్పండి."

"మునుపు త్రిపురాసురులనే రాక్షసులుండే వారు. వాళ్ళు లోకాన్ని ఎంతనాశనం చేస్తూన్నా వాళ్ళని జయించడానికి ఎవరి తరమయేది కాదు. ఎంచేతంటే వాళ్ళ ఆడవాళ్లు అంత పతివ్రతలు. అప్పుడు దేవతలందరూ కలిసి ఆలోచించారు. విష్ణుమూర్తి ఒక ఉపాయంచెప్పాడు. నారదుణ్ణి తనకు శిష్యుడుగా ఉండమన్నాడు. తాను ముసిలి పురోహితుడి వేషం వేసు

గున్నాడు. ”

“ ఊఁ ”

“ తర్వాత వాళ్ళిద్దరూకూడా ఆవేషం వేసుగుని త్రిపురానికి వెళ్ళారు. నెమ్మదిగా అక్కడ చేరారు. నారదుడిసాయంవల్ల క్రమేపీ అక్కడి స్త్రీలంతా పురోహితుడి దగ్గరికిచేరారు. అటు తర్వాత పురోహితుడు వాళ్ళకి ఉపదేశంచేశాడు. ఏమిటంటే, అనేకవ్రతాలు చెయ్యండని. అప్పుడు వాళ్ళు ఆవ్రతాలు చేస్తూ పతులమాటే తలపెట్టేవారు కారు. ఈమోస్తరుగా వాళ్లలో పతిభక్తి తగ్గిపోయేటప్పటికి, శివుడు సుళువుగా త్రిపురాసురుల్ని చంపేశాడు. ఇదీ కథ, వ్రతాలెందుకు సృష్టించబడ్డాయో విన్నావా ? ”

“ వ్రతాలింత చెడ్డవిటండీ ! ”

“ పతివ్రతాత్వం పోగొట్టడానికి ఈ వ్రతాలు కల్పించబడ్డాయి ”

“ అయితే మానెయ్యవలసిందే ”

“ తెలిశాకకూడా ఇంకా చేస్తారా ? ”

“ మరయితే నోములో ”

“ వ్రతాలికి అక్కచెల్లెళ్ళునోములు ”

“ మరి నోములవల్ల ధర్మంచేసుగుంటూ ఉంటూండడమవుతుంది కాదుటండీ. ”

“ అంటే నోములు లేకపోతే ధర్మం చెయ్యకూడదనా, మా మొగాళ్లకేనోములున్నాయి, ధర్మం చెయ్యడానికి ”

“ లేవులెండి ”

“ ధర్మం చెయ్యడంలేదూ ? ”

“ లేకేం ”

"ధర్మం చెయ్యడం నేర్చుకోవాలిగాని విచారణ శక్తి ధ్వంసంచేసే నోములను ఏర్పాటుచేసుగుని ధర్మం చేస్తున్నామని అనుకుంటూ ఉండకూడదు."

"అలాగే. కొన్నికొన్ని మరీమరీ చెడ్డనోములండీ. అవి చెయ్యడంలో ఏమీ బుద్ధిఉన్నట్టు కనబడదు. ఉసిరికాయదానం, పేడదానంకూడాను"

"అందుకనే ఇంక అవిఅన్నీ మానేసి బుద్ధి ఉపయోగించి పనులుచెయ్యి"

"అలాగే చేస్తాను."

౧౦

"ఏమిటా కాగితపు పొట్లాలు"

"అయినా చెప్పకో"

"ఏమిటో మీకోసం పంచెలు కొనుక్కు తెచ్చుకున్నారు కామోసు"

"అయినా విప్పి చూడు"

"(విప్పిచూసి ఆశ్చర్యపడి) ఇవ్వాడెందు కండీ, కొని తెచ్చారు. నాకుచెప్పనేనా చెప్పారా, ఇలా కొని తెస్తానని వద్దనేనా చెప్పే దాన్ని"

"నిన్నడిగితే గదూ ఏంచెప్పడానికీ!"

"అయ్యో! ఎందుకు కొని తెచ్చారండీ"

"ఖద్దరులో చక్కని రకాలొచ్చాయిగ చీరల్లో. అందుకని కొని తెచ్చాను. ఈ కొత్తరకాలు చాలాబాగాఉన్నాయి"

"మంచీమాటే మీకుకూడా కొని తెచ్చుగో లేకపోయారా?"

"కావలసినన్ని ఉంటూంటేనే"

" అయితే నాకేనా లేకపోయేయి. మీరుకూడా కొనితెచ్చు కుంటేగాని నేను వొప్పుగోను "

" అలాగేచూద్దాంలే '

" చూద్దాంకదూ. "

---

# * సహగమనం

[నూరేళ్ళ క్రిందట]

♦' ఏమిటోయ్! తెగ నవ్వుకుంటున్నావు. కడుపు చేత్తో పట్టుకు నవ్వుకుంటున్నావులే. పక్కలు పీకెట్టేను సుమా. బోర్లా పడి మొహం బద్దలుచేసుకుంటావు!'

'నేనే కాదు ఈకాగితం నువ్వు చదివినా అంతే చేసుకుంటావు'

' ఏమిట్రా కాగితంచూసి నవ్వుకుంటున్నావుట్రా! చాలా తెలివైన వాడివే!'

' నేను చెప్పానుగా ఈ కాగితం నువ్వుచదివినా అంతే చేసుకుంటావని'

' ఏమిటీ, అయితే చదువు చూదాం'

' మొదట నీ కదురు తీసి అవతలపెట్టు. తరవాత దంజాలు వదుక్కుందుగానిలే.'

' అలాగే. నువ్వు చదువుదూ మొదట.'

---

* వీణ మార్చినుండి జూన్ 1938; 'సాహిత్యం' విజ్ఞానదీపిక రజతోత్సవ సంచికలో అచ్చయింది.

♦ మామా అల్లుళ్ళమధ్య సంభాషణ

'కదురుతీసి అవతల పెట్టవయ్యా అంటూావుంటే.'

'ఊ. అయితే కాని. (వడకడం మానేస్తాను.)'

'ఇది అయిదేళ్ళకిందట అంటే క్రీ. శ. 1827 లో పాయిం డర్ అనే దొర ముండావాడు ఇండియాహౌసులో సహగమ నాన్ని గురించి తీర్మానం తెస్తూ చూపించిన ఒకనిదర్శనం. మహా గమ్మత్తుగా వుందిలే. చదువుతూవుంటే పొట్ట చెక్కలవు తుందన్నమాట.'

'ఏదీ చదువు మరి చూద్దాం'

(చదువును) 'ఇల్లువిడిచి పరదేశానికి వెళ్ళి ఒక బ్రాహ్మడు చనిపోయాడు. ఆయనపేరు సేతు. ఆయన భార్య వయస్సు పధ్నాలుగేళ్ళు. చచ్చిపోయిన పదిహేనురోజులికి ఆమెకి తెలి సింది. ఆమె బంధువులు చితిపేర్చారు' ఇంక యిటుమీాద గమ్మత్తుగావుంటుంది! చాలా ఖేషుగ్గావుంటుంది! (చదువును) 'ఆమె చితిపైకిఎక్కి తగలబడవలసివుంది. ఆమె తండ్రిపేరు పుట్నాతివారు. ఆయనకూడా యింటిదగ్గర లేడు. ఆయనకీసంగతి తెలియదు.' పాపం! ముసిలిముండావాడు యింటిదగ్గిరవుండి ఈ శుభకార్యం కళ్ళారా చూచుకునే యోగంలేక పోయింది. అంతా దైవఘటన అయ్యా. లేకపోతే యింతటి శుభ కార్యా నికి అతను వుండకపోవడమెలా తటస్థిస్తుంది చెప్పు.'

'అంతా మనవశమా. వాడు యెలానడిపితే అలా నడవా ల్సిందే.'

'అదే నేను చెప్పడం. అదిగాక—.'

'చదువు చదువు విందాం.'

'ఊ. విను (చదువును) 'కర్మకలాపం ముగిసింది. హుమ్లియా చితి యెక్కింది.' హుమ్లియా అంటే విధవముండ అన్నమాట.

దీనితల్లి సిగ్గొయ్యా ఎంత తమాషా చేసిందో చూడు. నవ్వలేక కడుపు చెక్కలవుతుంది. (చదువును) 'పినతండ్రి శివలాలు నిప్పంటించాడు. బాధ భరించలేక ఆమె చితినుంచి కిందికి దూకింది' మా తమాషాగా వుందయ్యా! ఇక్కడనుంచే యింక అందుకుంటుంది. (చదువును) 'శివలాలు మరి కొందరు కలిసి ఆమెను కాళ్ళూ చేతులూ కట్టి మళ్ళా మంటలో పారేశారు' మళ్ళా మంటలో పారేశారుటయ్యా! (నవ్వుతాడు)'

'ఊc. చదువు'

'(చదువును) 'ఆమె గుడ్డలు పూర్తిగా కాలాయి. వొళ్లు కొంచెం కాలింది. మళ్ళా ఆమె బయటికి వచ్చింది.' దీనిఅమ్మా సిగ్గొయ్యా! ఇంత కిలాడీ ముండని నేచూడలేదు. లేకపోతే ఇంత అల్లరి చేస్తుందా. అరి దీని తస్సాగొయ్యా! (చదువును) 'దగ్గిర వున్న భావిలోకి వురికింది. ఎంతటిముండో చూశావు? ఇంతకీ అందులో చస్తేమేమిటో ఇందులోచస్తే యేమిటో! దేవుని ధర్మమా అంటూ ఆ నూతిలో పడి చావలేదు. దేవుడు ధర్మం చూస్తూనే ఉంటాడు. సహగమనం చెయ్యవలసిన ముండను దేవుడు మటుకు మరోలాగు చంపేస్తాడా? కాని ఇంతకీ నీళ్లులేవు ఆ నూతిలో. అంచేత మళ్లీ బయటికి ఈడ్చారు, పడ్డని ఈడ్చినట్లు'

'ఏదీ చదువు చూద్దాం'

'(చదువును) 'రూపా అనేవాడు ఇచ్చిన గుడ్డపరిచి దీంట్లో కూచోమని శివలాలు కోరాడు. కాని ఆమె ఒప్పుగోలేదు.' (నవ్వును) అదిమట్టు గేమంత తక్కువ దనుకున్నా వేమిటి? మొత్తంమీద మహా చెడ్డతమాషాగా వుందిలే! (చదువును) 'నేను రాను అనిచెప్పి ఏడ్చింది. ఈడ్చారు. రాలేదు.' అమ్మ దీనిసిగదరగా! ఇంత మొండిముండటయ్యాఇది? ఇంకా చూడు

దీనిఅల్లరి. (చదువును) 'నేను మీ కుటుంబంలో వుండను. ఎక్కడికేనా వెళిపోతాను. మీ దయవుంటే బిచ్చమెత్తుకుని బతుకుతాను అని బతిమాలింది.' (నవ్వు) నిజంగా పాపం! విడిచి పెట్టెయ్యవలసిందే. ఎంచేతంటే, సహగమనం చేసి స్వర్గసౌఖ్యం పొందడంకంటే ముష్టియెత్తుకోడం గౌరవం కాదూ మరి! అంచేత అప్పుడు శివలాలుగారు ఏంచేశారంటే (చదువును) 'అమ్మా! ఈబట్టలో కూచో నిన్ను ఇంటికి తీసుకుపోతానని శివలాలుగారు గంగానది పేరుచెప్పి ఒట్టుపెట్టుకున్నాడు.' శ్రీహరీ! ఆ పాడుముండవల్లగదా పాపం ఆ మహానుభావుడు ఇంత ఘోరమయిన ప్రమాణం చెయ్యవలసివచ్చింది. ఆహా! దాన్ని ఇంతేసి ముక్కలకింద నరికినా పాపంలేదు. ఆపళంగా పచ్చడికింద తన్నేసెయ్యవలసింది. నేనుంటే అంతేచేతును. ఇంక చదువుతా విను. (చదువును) 'హుమ్లియూ బట్టలోకూచుంది. ఆమెను దానిలో వేసికట్టి వెదురుబొంగు తగిల్చి చితిదగ్గిరికి తీసుకువచ్చారు' (పకపకానవ్వు) నేనిది యింక చదవలేనయ్యా! నాకు ఓపిక లేదు బాబూ నవ్వడానికి. పక్కలు పీకెదుతున్నాయి. నువ్వు చదువుకుంటే చదువుకో, లేకపోతే మానెయ్యి.'

'మహాతమాషాగా వుంది చదువురా!'

'నేను చదవలేను బాబూ! నాకుపక్కలు పీకెదుతున్నాయి. కావలిస్తే నువ్వు చదువుకో'

'నాకు అచ్చుచూసి చదవడం అలవాటులేదురా. తాటాకు మీదీ అక్షరాలేగాని అచ్చక్షరాలు కంటికి ఆనవు. జోడెట్టుకున్నాసరే'

'సరి అయితే నీకోసమని చదువుతున్నా విను—(చదువును) 'మంట భగభగ మండుతూంది. దాంట్లో పడేశారు! పైన

చుట్టినబట్ట క్షణంలో కాలిపోయింది. ఆ దురదృష్టవంతురాలు ప్రాణం రక్షించుకోడానికి మళ్ళా ప్రయత్నించింది' (నవ్వి, ఒక్కమాటుగా ఆగి) ఆఁ! దురదృష్టవంతురా లంటాడేమిటీ వీడి పిండాకూడు?'

'తెలియనివాళ్ళకి అలాగే వుంటుందిలే.'

'ఆ అదృష్టం పదివేలయేళ్ళు తపస్సు చేస్తేమాత్రం మొగాళ్లకి పడుతుందిటయ్యా! ఈ సంగతి వాడికేం తెలుసు! వాడి మొహంలాగవుంది. ఇంక యివ్వాకు మరీ తమాషాగా వుంటుం దయ్యా! (చదువును) 'కాని శివలాలూ, తక్కిన బంధువులూ కలిసి కోరగా బుర్రైఅనే ఒక మహమ్మదీయుడు కత్తితో ఆమె గొంతుగ నరికాడు.' మంచిపని చేశాడు నాకు నచ్చిన పని చేశాడు. మెచ్చుకోతగిన పనిచేశాడు పాపం! తురకవాడయితే అయాడుగాని ఉపకార బుద్ధివున్నవాడు ఆరి! దాని తస్సా గొయ్యా, ఎంతబాధపెట్టిందయ్యా. ఎలాగయితె శివలాలు బాధ విరగడయింది. ఆ బ్రాహ్మణ్ణి ఇంతబాధ పెట్టినందుకు ఈ ముండ నరకంలో ఎన్నిబాధలు పడుతుందో? ఏదయితేయేం పీడవదిలిందిలే. ఇంక చదువుతా విను(చదువును) 'హుమ్లియాకు అన్ని బాధలూ వదిలిపోయాయి. ఈ దొంగాడు మళ్లా ఏమి రాస్తున్నాడో చూడు. వీడు పక్షపాతంగా రాస్తున్నాడయ్యా. శివలాలుకు అన్ని బాధలూ తీరిపోయాయి అని రాయడానికి బదులు దానికి - అంటే ఆ దొంగముండకు అన్ని బాధలూ వదిలిపోయాయి అంటున్నాడు. వీడి తెలివితేటలు కాలినట్టే వున్నాయి.'

'మన సాంప్రదాయాలు తెలియనివాళ్లు పాలనచేస్తే ఇలాగే వుంటుంది అబ్బాయి.'

'ఇంకా చదువుతా విను. (చదువును) 'హామ్లియా వెలికిలబడి కాలిపోయింది.' మంచిపని చేసింది ముండ. రక్షించింది. (పకపకనవ్వుతాడు) అది పారిపోడానికి చేసిన ప్రయత్నం తలుచుకొంటూ వుంటే నాకు పొట్టచెక్కలవుతూందయ్యా. మొత్తానికి అంతా మహా గమ్మత్తుగా వుందిలే.'

'ఓస్ ఇంతే కద్రటా. ఇంత కంటే అల్లరి చేసిన ముండల్ని చూశాను. మొగాళ్ళనుగూడా చితిలోకి లాగిన ముండల్ని నేను చూశాను.'

'నాకు అదే జ్ఞాపకమొస్తూవుంటే నవ్వొస్తుందయ్యా. ఔనుగాని మామా! మరి ఆడదాన్ని పాడెతో కట్టి చితి మీద పెట్టి దుంగవేసి ఆపళంగా వెదుళ్ళతో నొక్కుతారు గదా. ఈ ముండను మరి అలా విడిచి పెట్టారేమి?'

'మరి ఆదేశంలో నువ్వు చెప్పినట్లు గానే చేస్తారురా. ఎంచేత వాళ్లు దాన్ని అలాగ చెయ్యలేదో నాకు తెలియదు. చెయ్యక పోడంవల్లే చూశావా యెంత తమాషా జరిగిందో!'

'కాని అప్పుడు బాజాలు ఘట్టిగా వాయిస్తారెందు కయ్యా.'

'ఒక వేళ కాలుతూన్న మనిషి పెద్దపెద్ద కేకలు వేస్తుందనుకో, అది అసహ్యంగా వుంటుంది వినే వాళ్ళకు. అందుకూ ఆ మోస్తరుగా గట్టిగా వాయించడం.'

'అవును గాని ఈ సహగమనం జాతి వాళ్ళు మానెయ్యమంటే మన వాళ్లు మానెయ్యాడ మేమిటయా. నాకు చాలా చాలా విచారంగా వుంటుంది సుమా! మన వాళ్ల కేమయినా వివేక ముండాలా వద్దా. ఇంతకి జాతివాళ్లెవరూ మానెయ్యమనడానికి?'

'జాతివాళ్లెవరూ ఏమీ అనలేదురా. మన వాళ్ళకి పుట్టిన

బుద్ధే ఇది.'

'అవునయ్యోయ్! జ్ఞాపకమొచ్చింది. ఎవడో రామమోహన్ రాయిట. ఆ రాయి రప్పగాడు యెలా మానిపించాడయా?'

'ఎలాగో జాతివాళ్ళను పురికొల్పాడు మీరీ ఉపకారం చేసి తీరాలన్నాడు. మీ అంతటి వాళ్ళు లోకంలో లేరన్నాడు. దానితో వాళ్లుబ్బి తబ్బిబ్బయి మూడేళ్ళకిందట ఒక చట్టం యేర్పరిచారు. ఆ చట్టంతో యిప్పుడు సహగమనాలు చెయ్యడం నేరమయి పోయింది.

'ఈ రామమోహన్ రాయి ఏమని వాదించాడేమిటి?'

'వాడిదంతా ఓ విచిత్ర వాదన. మనుస్మృతిలో సహగమనము చెప్పలేదు. తక్కిన స్మృతులలో మాత్రమే చెప్పబడి వుంది. ఈ కాలంలో మనకి మనుస్మృతే కదా ప్రమాణం అన్నాడు. ఇంతకీ సహగమనం వొక దుర్మార్గంట; క్రూరమైన కార్యంట. అసలు మన వేదాంతానికి వ్యతిరేకంట! స్వర్గానుభవం కోసం కదా మీరు సతి చేయిస్తున్నారు. నిష్కామకర్మ ఉత్తమమైనదని వేదాలూ, ఉపనిషత్తులూ చెప్తూంటే మీరు స్వర్గసౌఖ్యంకోసమని అది జరపడం తప్పుకాదా అని అడిగాడు.'

'అంటేమన వాళ్లు యేమన్నారు.'

'ఏమన్నారు, నీది ఉత్త కొంటివాదన అన్నారు. శాస్త్రాల ప్రకారం సహగమనం కూడకపోతే ఆచారం ప్రకారం కూడుతుందన్నారు.'

'అంటే వాడు?'

'ఆచారమైతే క్రూరమైన ఆచారం అంచేత కూడదన్నాడు.'

'వీడు మహా ఘట్టివాడులాగున్నాడే, మన వేలితో మన

కన్నే పొడుస్తున్నాడు. అతనన్నాడని ఆపళంగా వూరుకున్నా రేమిటి మన వాళ్లంతా?'

'మనవాళ్ళు దద్దమ్మలట్రా వూరుకోడానికి. ఆ పళంగా వూరువూరా సభలు జరిపారు. మహజర్లు పెట్టారు. గొప్ప గొప్ప పండితులంతా వెళ్ళి గవర్నరుజనరలుగారికి 'అయ్యా మీరు చేస్తున్నపని చాలాచెడ్డది; హిందూమత నాశనకరమైన దని, బోధ పరిచారు. అంతకంటె ఎవరు మటుకు ఏమిటి చేస్తారురా. మరి కొందరు ఆ తరువాత ఏమయినా సరే జరిపించి తీరుతామని సహగమనాలు జరిపించి జయిళ్ళకు వెళ్ళి కూర్చు న్నారు. ఇంతకంటె ఏంచెయ్యగలరురా ఎవరుమటుకు.'

'మరి మొన్న ఏదో పార్లమెంటుకు ...'

'అది ఈయేడే జరిగింది. పార్లమెంటుకు మన వాళ్ళు వెళ్ళి ఆ దుర్మార్గపుచట్టాన్ని రద్దుపరచమని మొరపెట్టారు. కాని వీళ్ళ మొరవిన్నవాళ్ళెవరూ! పోస్ పొమ్మన్నారు వాళ్ళు ఆపళంగా తిరిగివచ్చేశారు.'

'ఆరి వీళ్ళతస్సాగొయ్యా. ఎంతపనిచేశారయ్యా. ఇదిగో ఇంతటితో యిది పోతుందనుకున్నావు కామోసు. ఎన్నటికీ అనుకోకు. వెనక అక్బరుగారు కూడా యిలాంటిపనే చేశారుట. కాని పోయిందా? ఇప్పటికీ అంతేననుకో.'

'అది కాదురా. ఇది యిప్పుడు జాతివాళ్ళుచేసిన పని కాదురా, వాళ్ళచెయ్యి పట్టుకుని మనవాళ్లు చేయించినపనేరా యిది.'

'అంటే జాతివాళ్ల ప్రభుత్వంపోయాక తిరిగి వస్తుందంటావు.'

'ఏమిట్రా నామాట వినిపించుకోవు. ఇది మనవాళ్లుచేసిన పనేరా అంటూవుంటే. జాతివాళ్ళు పోయేది, దేవుడు పోయేది.

ఇది తిరిగివచ్చేసూచనలు లేవు. మనలో మనవాళ్లు ఏర్పాటు చేసుకున్న చట్టమేరా ఇది. ఎవరుపోయినా సరే యిదిపోదు.'

'హిందువులికి వినాశకాలం వచ్చిందయ్యా. మతగౌరవం తగలడిపోయేరోజులు వచ్చాయి. బ్రాహ్మణ్యం చెడిపోతోంది. ఇదంతా కలికాలమహిమ. ఇంకా ముందు ముందు ఎటువంటివి వస్తాయో ఏమిటో!'

'మనవాళ్లు పూర్వాచారులు అయేవరకూ ఇటువంటివి తప్పవనుకో! పూర్వాచారమనేది ఒకటే ఇటువంటివాటి కన్నిటికీ దివ్యౌషధం.'

'సరే.'

---

# నందన కరువు

[ నూాళ్ళ కిందట ]

సుబ్బయ్య: నందనసంవత్సరం కరువుకాలందాటి మనం బతుకుతాం అనుకోలేదురా రామూ!

రామశాస్త్రి: ఏదో నాలుగురోజుల కొకపూట పిడికెడు మెతుకులు తిని బతికేం.

వెంకటశాస్త్రి: తిండి నాలుగురోజుల కొకపూట దొరికినా ఎక్కడపడితే అక్కడ మంచినీళ్లు దొరికినా బాగుండును. మంచి నీళ్ళేమిటి నీళ్ళంటూ దొరికినా బాగుండేది.

సు: నీళ్ళుదొరికితే ఇంత కరువేమిట్రా.

రా: కృష్ణ మొదలు నెల్లూరువరకూ ఒక్కచుక్క లేవంటే నమ్మి.

సు: పొలాల్లో విత్తనాలుచల్లండే. నీళ్లుంటేగా దున్నడానికి. విత్తనాలుకూడా తగలేసుకోడమెందుకు ఎప్పుడో ఒకప్పుడు ఒక పూట గడుస్తుంది కదా అని అవీ జాగ్రత్త పెట్టుకొన్నారు ప్రజ.

వెం: మనమాటకేంగాని శూద్రాదులురా కేవలం మట్టి తిన్నారు, అంతకంటే మరేం దొరకక. దొరికినన్నాళ్ళూ గొడ్లను చంపుకుతిన్నారు. అప్పటికీ లక్షలు లక్షలు ఎగిరి పోయారు. రోడ్లపక్క శవాలేగదా. నక్కలకీ, రాబందులికీ పండగ. ఊళ్ళన్నీ శ్మశానాలయాయి.

రా: నక్కలయి పుట్టినా బాగుండేదిరా బతికుందురు ప్రజ.

సు: అందరూ నక్కలయితే మళ్లా అదీబాధే.

రా: కొంతమందే నక్కలవడం.

సు: ఆరోజులు తలచుకుంటే గుండె ఝల్లుమంటూంది.

రా: నావొళ్లు జలదరిస్తూంది.

వెం: ఈదేశం విడిచి మహారాష్ట్రంలో కెయిరావైపు బ్రాహ్మలూ, కోమట్లూ, లేచిపోయారు చాలామంది.

సు: గుంటూరులో కలరా తిరిగితిరిగివచ్చి నాశనంచేసేసింది.

రా: కలరా అదో దేవత అంటారు.

సు: దేవతాకాదు. దెయ్యంకాదు. మనని నాశనం చెయ్య డానికొచ్చిన మహారోగం. అంతకుముందు ధగ్గులబాధ, దాని మీద కలరా, దానిమీద కరువు.

రా: ధగ్గులంత మోసగుట్టు ముండాకొడుకులు ప్రపంచంలో లేరురా. గొంతుక్కి చేతిరుమాలు ఉరిపోసి చంపడం.

వెం: ఏదయినా వెనకటి పిండారీలకంటే నయమే.

సు: వాళ్లువూళ్ళో చొరబడి డబ్బువున్నవాళ్ళనీ లేనివాళ్ళనీ కూడా వొళ్ళుకాల్చి నరికి చంపేరు.

వెం: మనదగ్గిర కత్తులూ కటారులు వున్నాయన్నమాట గాని అవి మనకంటే వాళ్లకే వుపయోగపడేవి.

సు: తూర్పున యిప్పటికీ ఇంతకంటే నరకంగా వుందయ్యా.

రా: ఏం.

సు: మామ్మూలుగా దొంగలబాధ.

రా: సరే.

సు: దానిమీద బందిపోట్లబాధ, ఊళ్ళకి వూళ్ళే నాశనం చేసెయ్యడం.

రా: ఊఁ.

సు: జమీందారులే దొంగలగురువులు. వాళ్లు దొంగలను తయారుచేసి ఊళ్లమీదకు పంపుతారు దోచుకోడానికి. తర్వాత పంచుకొంటారు.

రా: అబ్బ! అక్కడి బతుకు చెప్పలేం.

వెం: చెప్పేదేమిటి? బతకడంకంటే చావడం మేలు.

సు: పద్మనాభ యుద్ధంతర్వాత దేశం చెడిపోయిందిరా.

రా: ఊఁ

సు: చిల్లర జమీందారీలు తయారయాయి. సరిహద్దుల కోసం వీళ్ళలో వీళ్ళు కొట్లాడుకుంటూ వుండడం. ఇంగ్లీషు వాళ్ళతో పితూరీలు. దీనికి మరో కారణంకూడా వుంది.

రా: ఊఁ

సు: జమీందారుకంటే పోలీసాడికి ఎక్కువ అధికారం యిచ్చేశాడు తెల్లవాడు.

రా: పోలీస్వాడికి, చదువులేనివాడికి అధికారమా?

సు: అందుచేతే బోలెడన్ని పితూరీలు. తూర్పంతా పితూరీలే. ఒక్క బందరుజిల్లా శాంతంగావుంది.

వెం: ఒక్క ప్రభుత్వమంటూ ఏడిస్తేగా. ఎవళ్లకి వాళ్ళే ప్రభువులు. నానాబీభత్సంగానూ వుందంటే నమ్ము. అవతల మనవాళ్లు రాజులయినా బాగుండును లేక తెల్లవాళ్లు దొర లయినా బాగుండును. అదీ ఇదీ లేకపోవడంవల్ల ఎవరిమటుకు వారే రాజులు. నలుగురిని పోగుచెయ్యడం ఆమట్టుగు పితూరి. ఊళ్ళు కొల్లగొట్టడం, తినడం.

సు: ఇంగ్లీషువాళ్ళదే పైచెయ్యి అవుతుందిరా క్రమేపీ.

రా: ఎవరిదయితే మనకేం. దేశమంతా సుఖంగా వుంటే చాలు. ఎప్పుడొస్తాయో ఆ రోజులు.

వెం: ఇప్పుడున్నస్థితిలో కాలుగడప అవతల పెట్టలేకుండా వున్నాంకదా. ప్రాణభీతి. హైదాబాద్‌లో పట్టపగలు ఖూనీలు జరిగి పోతూవుంటాయి నడిరోడ్డుమీద. ఎవడికి వాడే కత్తి చేత్తో పట్టుగుతిరగాలి. ఏ మొస్తుందో ఏమిటోఅని.

సు: తెలుగువాడిగతే యిలాగుంటే తక్కినవాళ్ళగతి యింకెలా గుంటుందోచెప్పు.

రా: ఏం?

సు: దేశం నాలుగుమూలలా తిరిగేవాడు ఒక్క తెలుగు వాడేకదా. కన్యాకుమారి దగ్గరనుంచి కాశ్మీరంవరకూ తెలుగు వాడు వెళ్లనిస్థలం లేదుకదా. తెలుగు వాడికుండే ధైర్యసాహ సాలు మరెవ్వరి కున్నాయి.

రా: మరెవ్వడూ వెళ్ళడంటావు!

సు: ఇంకవెళ్లేవా ళ్ళెవళ్లురా. అరవవాడా పిరికిపంద, ఇల్లు కదలడు. కన్నడలు భూమి పండితే తిందాం లేకుంటే వస్తుందా మంటారుగాని మరోచోటికి వెళ్ళరు. పూనా సంస్థానం చెడి పోయింది కాబట్టి ఒక్క మహారాష్ట్రులు హిందూస్తాన్ బస్తీ

లలో ఇప్పుడు ప్రవేశిస్తున్నారు. ఘూర్జరులు కులాభిమానులూ వర్తకసంచు తెలిసినవాళ్ళూ కాబట్టి మరో చోటికి వెళ్ళారు. పంచగౌడులు దక్షిణానికి రారు. బంగాళీలు అరవలకంటే పిరికి పందలు. మొత్తంమీద వారంతా అన్నంతినే నేల చాలా నిస్సారమైనదని గర్వపడి ఈ దేశానికి రారు. ఇంక మనం తెలుగు వాళ్ళం ఎక్కడచూసినా మనమే. అలాంటి మనబతుకే యిలా గుంటే ఇంక తక్కినవాళ్ళ సంగతి చెప్పేదేమిటి.

రా: చెన్నపట్నం కబుర్లు ఏరోజు కారోజే ఇక్కడ కొచ్చేస్తూ వుంటాయి.

వెం: ఉప్పాడ బోయీలకున్న ప్రాశస్త్యం ఇతర జాతుల వాళ్ళకి లేదుకదా. చెన్నపట్టణంలో అంతా వాళ్లే.

రా: పోనీ తెలుగుపట్టణం కాబట్టి చెన్నపట్టణానికి వెళు తున్నారనుకోరాదూ.

వెం: అంతేకాదు. వాళ్ళతో సమానమైనవాళ్లు లేరుకాబట్టి వాళ్ళని బతిమాలుకుని తీసుకెళుతున్నారు చెన్నపట్టణానికి.

సు: హోల్కార్, సింధ్యా, సింధ్యాలు చెడిపోడం మనకి ముప్పొచ్చిందిరా.

వెం: ఏం?

సు: అక్కడికి వెళ్ళిన మనవాళ్లు తిరిగి రావడంలేదు. సంపాదించుకొద్దామని బయలుదేరి ఉత్తచేతులతో తిరిగిరావడమా అని అక్కడే వుండిపోతున్నారు. ఇంటిదగ్గర పెళ్లాం బిడ్డలు కొట్లాడిపోతున్నారు.

వెం: వెళ్ళినపని చూసుకొనిరావాలి కాని వృత్తసేవ స్తేయేం లాభంరా.

సు: వాళ్ళింకా రాలేదుకదా అని కొత్తజట్టు బయలుదేర

కుండా వున్నారు.

వెం: మహారాష్ట్ర సంస్థానాలు చెడిపోవడం మనకు ముప్పొచ్చిందిరా.

రా: పోనిద్దూ మహారాష్ట్రులతోపాటు మనవాళ్లుకూడా హిందూస్థానీ బస్తీలు చేరుకుంటారు.

సు: మనమేమిా అరవలమా, కన్నడులమా బంగాళీలమా దేశసంచారం చెయ్యడానికి, భయపడడానికి.

వెం: అంచేతె మనం తక్కిన వాళ్ళకంటే బాగుపడు తున్నాం.

సు: నిజమే.

---

# * నియోగీ - వైదీకీ

[నూకళ్ళ కిందట]

అన్నంభట్లు: ఒరే కొండురావూ!

కొండుశ్రౌతి; ఓరి నీ అమ్మకడుపిదయిపోను, నన్ను కొండు రావంటా వేమిట్రోయ్!

బ్రహ్మావధాన్లు: (నవ్వుతాడు)

అన్న: (పిచ్చయ్యశాస్త్రితో) తప్పేముందిరా పిచ్చయ్యస్వామిా!

పిచ్చయ్యశాస్త్రి: అదేమిటోయ్! నాకూ కొత్తపేరెట్టావు! నీ తెలివితేటలు కాలినట్టేవున్నాయి.

బ్రహ్మ: (నవ్వుతాడు)

---

* వీణ మే 1938

అన్నం: తప్పేముందిరా ? కావలిస్తే నన్ను పిలువు అన్నం రాజని.

కొండు: ఏడిసినట్లే వుంది.

పిచ్చు: మహాబాగా చెప్పావుకదూ.

బ్రహ్మ: (నవ్వుతాడు)

అన్నం: ఔనురా, నియోగులంతా మనకొసలు తగిలించు కొంటున్నారురా! దీక్షితులు, పాకయాజి, శాస్త్రి, అవధాని, శ్రౌతి, శర్మఅని. మనం వాళ్ళ కొసలు తగిలించు కుందాం! రావు, రాజు, స్వామిఅని.

పిచ్చు: నిజమేరా అన్నంరాజూ.

అన్నం: భేష్ మహాబాగా పిలిచావురా నన్ను.

బ్రహ్మ: (నవ్వుతాడు)

అన్నం: (పిచ్చయ్యశాస్త్రితో) రేపల్లె కాపురస్థులైన నంది రాజు లక్ష్మీనారాయణ దీక్షితులు బహద్దరువారు నియోగుల కందరికీ మన కొసలు తగిలించాడా లేదా ? ఏమంటావు ?

కొండు: వాడి మొఖం, వాడి ముఖమంటూ.

పిచ్చు: అవునుగాని ఈ దీక్షితులు మీాద అనేక పుస్తకాలు బయలు దేరాయిరా. ఆయన దేవుడే అంటారు కొందరు. కేవలం దక్షిణామూర్తి అవతార మంటారుకొందరూ. ఒక ప్రబంధాలేమిటి, యక్షగానాలేమిటి, హరికథ రేమిటి కథలేమిటి, ఇదేమిటి అదేమిటి సమస్తం బయలుదేరాయి.

కొండు: ఏడిశాడులే.

అన్నం: పద్ధతి నియోగిధ్వజం చెలరేగి పోతుందోయ్!

కొండు: ఒక శుభానికనికాదు అశుభాని కనిగాదు, మనం దేనికీ పనికిరాముట.

అన్నం: సమస్తం వాళ్ళే చేసుకుంటూంటేనే. వాళ్ళు చెయ్య లేనిదేమీ లేదుట! పుండ్రధారణం, ఆచమనాలు, సంకల్పం, శ్రాద్ధాలూ, తాంబూలప్రదానం, ముద్రాజ్ఞానం, అర్ఘ్యప్రదానం, సప్తపాకయజ్ఞాలు, పతితాశౌచం, జాత్యాశౌచం ఇదేమి టదే మిటి సమస్తం వాళ్ళే చేసుకొంటున్నారు.

కొండు: వాళ్ళ మొహంకాదూ వాళ్ళ మొహమని! ఈ నియోగపాళ్ళను చీరేస్తాను యెవడు అడ్డొస్తాడో చూస్తాను.

బ్రహ్మ: ఒరేయ్! ఇప్పుడుమనం వాళ్ళయిళ్లకి వెళితే మున పటిలా లేచి నిలబడకుండా ఉన్నారురా.

అన్నం: మనకంటే తక్కువవాళ్లు కదా, వాళ్లకెందు కొచ్చిన పోయెకాలమిది చెప్పు!

కొండు: ఇంతకీ నియోగ ప్రభువులు కాదుటయ్యా! ప్రభువులయినప్పుడు మనకంటే తక్కువంటావా ఎక్కువంటావా? చెప్పు. చెప్పవేం? మనం వెళితే నిలబడొద్దూ?

బ్రహ్మ: ఈ కృష్ణకి పదమటఉండే నియోగుల్ని కావలిస్తే అడిగిచూడు, 'మీరు బ్రాహ్మలు కారుటయ్యా అని. వాళ్ళే మంటారోచూడు! మేము కరణాలం బ్రాహ్మలంకాము, అంటారు.

కొండు: చూశావామరి! వాళ్లు బ్రాహ్మలు కానప్పుడు మనంవెళితే నిలబడొద్దూ? న్యాయంచెప్పు పోనీ.

అన్నం: న్యాయమేమిటి, అన్యాయమేమిటి, తెగించిన ముండాకొడుకులికి.

కొండు: తెగించిన ముండాకొడుకులా, దెయ్యం ముండా కొడుకులా!

అన్నం: అన్నిరకాల కర్మలూ మనం చేయించాలిగాని

నియోగులా చేయించడం. శిష్టాచారమంతా మంటకలిసి పోడంలేదూ ?

బ్రహ్మ: వాళ్ళలో ఏమి బ్రాహ్మణత్వం తగులడిందని చెప్పు, ఇలాటింపనీ్న చెయ్యడం. వేషంచూస్తే రాజులవేషం. నెత్తికి చెమ్లా, పొడుగుపాటికోటు, కాళ్లకి షరాయి. కొంపలోనా అన్నీ రాజుల ఆచారాలే. బ్రహ్మిగాడి కుండవలసిన ఆచారం ఒక్కటి లేదుకదా. పేరుకొక్కటి. రాజుల్ని చూసి చివరికి మద్యపానం కూడా—అనకూడదుకాని. అంతకితూగలేని ముండాకొడుకులు రెడ్డి దొరల్ని చూసిచుట్టకాల్చడం! ఇదీ వాళ్లలోఉన్న శ్రోత్రియత్వం.

పిచ్చు: మనలోమట్టుగు అంతకంటే మంచి ఏం ఏడిసిందిరా! వాళ్ళలో తప్పులుంటే మనలోనూ ఉన్నాయి. వాళ్ళు రాజుల్ని అనుకరిస్తే మనవాళ్ళు కొందరు వాళ్ళని అనుకరించి మీసాలు పెంచుకుంటున్నారు. వేదముక్కలు మానేసి ఏదో చచ్చు బొక్కు ఉద్యోగాల్లో చేరుతున్నారు. పోనీ అచ్ఛంగా వైదికంలో పడిఉన్న వాళ్ళైనా అంతకంటే స్వచ్ఛంగా ఉంటున్నారా అంటే, మళ్లా అదిలేదు. డబ్బంటే నానాగడ్డి తినెయ్యడమే. ఇక్కడ కుదరదనిచెప్పి పూనా సతారాలకు పారిపోయి అక్కడ శల్య పాయసాలు కడుపునిండా తాగి చేతినిండా డబ్బులు పుచ్చుకోడం. ఇదీ మన వైదికపాళ్లు చేస్తూన్న పని.

కొండు: ఒరేయ్! ఈ పిచ్చయ్యగాడు మహా చెడ్డపిచ్చిగా పేలుతున్నాడురా! వీణ్ణి వెలెయ్యాలిరా! వెలేస్తేగాని వీడికి బుద్ధి రాదురా! వీడు అనియోగపాళ్లను వెనకేసుగొచ్చి మనని అయినవీ కానివీ కారుకూతలు కూస్తున్నాడురా.

పిచ్చు: అది కాదురా నే చెప్పేది. తప్పులన్నీ వాళ్లలోనే ఉన్నాయి మనం స్వచ్ఛంగా స్ఫటికంలాగ ఉన్నామంటే ఇలాంటి

వన్నీ చెప్పవలసొస్తుంది. తప్పులు వాళ్లలోనూ ఉన్నాయి మన లోను ఉన్నాయి.

కొండు: అయితే వాళ్ళలోకూడా తప్పులున్నా యంటావూ?

పిచ్చు: బోలెడన్ని! తలమీద వెంట్రుక లన్ని!

కొండు: అదే నాకుకావలసింది. అదే నేను చెప్పడమిప్పుడు.

బ్రహ్మ: ఒరే! ఈ దీక్షితులికి ఈ శ్రౌతం, స్మార్తం, వేదాంతం, భాష్యం నేర్పిన గాడిదకొడు కెవడురా?

కొండు: ఒకదరిద్రగొట్టు అభాజనపు అప్రాచ్యపు ఛాందసు న్నాడులే! వాడూ! అక్కన్న శాస్త్రిలు ముండాకొడుకు! వాడూ ఇవన్నీ నేర్పాడు నారడికి.

బ్రహ్మ: ఒక్కొక్క వేళకి అలాంటిద్రోహి ఒక్కొక్కడు బయలుదేరుతూ ఉంటాడులే, మతం నాశనం చెయ్యడానికి.

అన్నం: ఈ అక్కన్నశాస్త్రిలు అంతటితో ఊరుకోలేదు.

బ్రహ్మ: ఊరుకోక ?

అన్న: ఊరుకోక నారడిని గురుదక్షిణ ఇమ్మని అడుగుతూ, నువ్వు నాకు గురుదక్షిణగా ఇయ్యవలసింది మరేంలేదు. పద్ధతి నియోగాన్ని ఖండించే వారి ఖండనలని మండించెయ్యడమే నువ్వు నాకు గురుదక్షిణగా ఇయ్యవలసింది అన్నాడు. అంటే, ఇంకేముంది దానిమీద అబ్బాయిగారు కోతికి కల్లు పట్టినట్టుగా చెలరేగి పోతున్నాడు.

బ్రహ్మ: ఆరిపీడెమ్మకడుపుకాలా! అక్కశాస్త్రిలుముండా కొడుకు ఎంతపనిచేశాడురా! వీణ్ణి ఉప్పుపాతరెయ్యా. చివరికి మన వెధవ పెట్టినపెంటే యిదీ. హరిహరి. వాడు బలేముండా కొడుకులావున్నాడు చూస్తే.

కొండు: ఇంతా అంతానా. పొగరుబోతుల్లో మొదటిరకం.

బ్రహ్మ: అయితే ఈనారడికి ఎవడయ్యా వ్యతిరేకంగా పనిచేస్తున్నవాడు.

అన్నం: అక్కన్న శాస్త్రిలదగ్గర నారడితో కూడాకలిసి చదువుకొన్నవాడే. మనవాడు విశ్వపతిశాస్త్రిలు. నారడివాద నలను ఎక్కడికక్కడకి ఖండించి ముక్కలుచేసి పారేస్తున్నాడు.

పిచ్చ: ఆయనో! ఎక్కడి కక్కడికి మండించిపారేష్తున్నాడు. ఇలాగ అలాగాకాదు, విశ్వపత్యసురవిజయం, విశ్వపతి రక్షో నాశనం, విశ్వపతి దుంపనాశమని పుస్తకాలకు పేర్లెట్టి.

బ్రహ్మ: ఏమిటీ మనమంతా అసురులమా? రాక్షసులమా? వాడికేం పోయేకాలం పుట్టింది అలా పేర్లెట్టడానికి.

పిచ్చ: వాడినాలిక చీల్చినానరే పాపంలేదు.

కొండు: దీనికంతా అనుభవిస్తున్నాడులే. పెళ్ళాంచచ్చిపోయి నప్పుడు దగ్గరకొచ్చిన ముండాకొడుకు ఒక్కడూ లేడుకదా. ఒక్కడంటే నమ్మమరి. చివరికి కుక్కైనా దగ్గరికి వెళ్ళలేదు.

బ్రహ్మ: ఏం, ఎందుచేత.

కొండు: ఎందుచేతేమిటి. ఇలాంటి అప్రాచ్యుడికి సహాయం చేసేవాడెవడురా లోకంలో! బతిమాలుకుంటూ మనవాళ్ళని రమ్మన్నాడు. ఓయ్! బతిమాలుకుంటూ మనవాళ్ళని రమ్మ న్నాడు. కర్మచేయించి పోదురుగాని రండన్నాడు.

బ్రహ్మ: మనవాళ్ళేమన్నారు.

కొండు: ఛస్, నీ మొహంచూడకూడదు, చూస్తే పాప మొస్తుంది, ఛో, పొమ్మన్నారవతలికి.

బ్రహ్మ: అంటే అతను.

కొండు: ఇలికా బతిమాలేడు. ఇంకా బతిమాలగా అప్పు డన్నారు మాకందరికీ ప్రదక్షిణ నమస్కారాలుచేసి చెంపలు

వాయించుకో. అలా వాయించుకుంటే వస్తాం అని. ఆ తర్వాత వాడితిప్పలు వాడు పడ్డాడులే. ఏదో తనే చేసుకుని ఏడ్చాడుట.

బ్రహ్మ: ఏమిటీ తనే చేసు కున్నాడా! ఎంతపని చేశాడురా వీడి దౌర్జన్యంమండా! ఆహా! ఔనుగాని అతగాడు బందరులో వద్దమన్నాటి వెంకప్పచేత యజ్ఞం చేయించాడు టేమిటి!

కొండు: ఆ యజ్ఞం ఒకంతట జరగనిచ్చారుటా ్రి మనవాళ్ళు. ముప్పుతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించారు. నారదు వెధవ వేషాలన్నీ వేసుకు చివరికి ఆవూరు చేరి ఏదో మొత్తుకున్నాడు.

బ్రహ్మ: చిట్టచివరకి జరిపించా డన్నమాటే. మహాబాగా వుంది. ఘటికుడనిపించుకున్నాడు. అక్కడో వేదపాఠశాలకూడా పెట్టించాడుట కాదూ నియోగులకి.

కొండు: ఏడవనిద్దూ. మొర్రో మని ఏడవనీ ఎవడిక్కావాలి. శిష్టాచారమంతా తగులడిపోయాక యజ్ఞంచేస్తే ఎవడికి కావాలి, వేదపాఠశాల పెడితే ఎవడికి కావాలి. ఒకటి బాగుంది కనకా మరొకటి చెడిపోయిందని ఏడవటానికి. అన్నీ బుగ్గయి పోయాయి, తీరిపోయింది.

బ్రహ్మ: ఓయ్! ఇదిగో అలాగనకు. మనకు విశ్వపతి శాస్త్రిలు వున్నన్నాళ్లూ మరేం పర్వాలేదు. మరేం పర్వాలే దంటే నమ్ము. నారిగాడుచేసే పనులన్నిటినీ మండించేస్తూ వుం టాడు. అత నున్నంతకాలం మనకేం పర్వాలేదు. నమ్ము నా మాట వినుమరి.

కొండు: చాలులేరా.

పిచ్చు: ఇంకేం భేషుగ్గా ఉంది!

---

# ఇంగిలీషు చదువు

[నూరేళ్ళ కిందట]

పెద్దకొడుకు: ఏంనాన్నా ఇవాళ ప్రవేశ పెట్టాడయ్యా బాబయ్యమరేమో చిన్నాణ్ణి మిషన్ స్కూల్లో.

తండ్రి: వాడన్నంతపనీ చేశాడురా, ఎవడుచెప్పినా వినకుండా వున్నాడురా.

పెద్ద: ఏమిటయ్యా అలాగంటావు? చిన్నవాడికి మంచి మంచి పుస్తకాలన్నీ కొనిచ్చాడయ్యా! నేనూ దగ్గిరేవున్నా. రావిపాటి గురుమూర్తి శాస్త్రిలుగారి పంచతంత్రకథ ఒకటి, పుదూరి సీతారామశాస్త్రిగారు కొత్తగారాసిన పెద్దబాలశిక్ష ఒకటి. దీంట్లో కొంతభాగం చదవాలిట. ఆతర్వాత మదరాసు పాఠ్యపుస్తక నిర్ణయసమితివారు పదమూడేళ్ళ కిందట అంటే 1821 లో అచ్చువేసిన 'వేడుక కథలు' ఒకటి. ఈ పుస్తకం అప్పటినుంచి ఇప్పటివరకూ మారలేదు. 'బైబిల్ బుక్కు' ఒక్కటి. ఇవీ పాఠ్యపుస్తకాలు.

చిన్నకొడుకు: ఏంనాన్నా అచ్చువి చదివితే పాపంకాదు? అన్నయ్యకింకా తెలియదుకాని.

తండ్రి: అసలు అచ్చు, బైబిలుకోసం పుట్టిందిరా. బైబుల్ వెయ్యడానికేగాని అచ్చుమరెందుకూ పనికిరాదురా.

చిన్న: దొరలు వేదంకూడా అచ్చువేశారుట కాదూ నానా?

తండ్రి; వేశారు! వాళ్ళ మొహంవేశారు!! అన్నీ తప్పులే చెప్పారు మనవాళ్ళు. మనవాళ్ళేం తెలివితక్కువ వాళ్ళట్రా, వాళ్ళడగగానే చెప్పడానికి. వాళ్ళడిగిన దొకటి మనవాళ్ళు

---
* వీణ జూన్ 1938

చెప్పినదొకటీ. అంచేత ఆ అచ్చువేయించిన దోరముండావాడు ఆ తర్వాత మొత్తుకుని ఏడ్చాడు.

చిన్న: (అన్నతో) ఇప్పటికేనా తెలుసుకున్నావా, అచ్చు వేసిన పుస్తకం చదివితే పాపమొస్తుందని.

పెద్ద: సరేలే.

తండ్రి: అంచేతేరా మనం అచ్చుపుస్తకాలు చదవకూడదు. అచ్చువేసిన రామాయణం పారాయణపనికిరాదుకదా. అచ్చు వేసిన పుస్తకం మడిబట్టతో ముట్టుకోకూడదుకదా అరవవాళ్లు తెలియక పుస్తకాలు అచ్చువేయించు కుంటున్నారుగాని మన వాళ్ళుచూడు ఎంత బుద్ధిమంతులో! ఎక్కడేనా పుస్తకాలు అచ్చువేయించుకుంటున్నారోమో చూడు. ఏక్కడో కాని పుస్తకంఅచ్చు పడకుండావుంది తెలుగులో.

పెద్ద: అచ్చు వేయించుకున్న పుస్తకం చదివితే ఎంతో బాగుంటుందయ్యా!

తండ్రి: ఈ మిషన్‌వాళ్ళువచ్చి అచ్చు మొదలెట్టారురా. బైబిల్ అచ్చువేయించడం ఆపళంగా అందరినీ మతంలో కల పడం.

చిన్న: (తండ్రితో) మిషన్‌స్కూళ్ళలో బైబిల్ మొట్ట మొదట చెప్తారుటయ్యా. మనవీధిబళ్ళు ఎంతోనయం నాన్నా. మనవీధిబళ్ళలో చస్తేఇంగ్లీషు చదువుండదు. ఏదోమనకు కావల సిన తెలుగుముక్కలు నాలుగునేర్పుతారు. అదిచాలదూ? ఈ సంగతి అన్నయ్యకి తెలియదయ్యా. నేను మొన్న రోడ్డుమీద నడిచి వస్తూవుంటే ఒక మిషనరీ పట్టపగలు పెద్దపెద్ద కేకలువేసు గుంటూ వస్తున్నాడు. ఏమనీ 'మీరంతా చీకట్లోవున్నారు. వెలుగులోకి రండీ' అని. వీడికిగాని పిచ్చెత్తిందా యేమిటని అను

కున్నాను. మనమంతా చీకట్లోవున్నాంట, వాడొక్కడే వెలుగులో దొర్లుతున్నాడుట.

తండ్రి: (నవ్వి) వాడిమొఖంలాగుంది. వాడిమొఖమని.

చిన్న: దొరలంటే మాలాళ్ళుకాదు నాన్నా? లేకపోతే మాలాళ్ళని వాళ్ళమతంలో ఎందుకుచేర్చుకుంటారు?

తండ్రి: ఔనురా, వాళ్ళని ముట్టుకుంటే స్నానం చెయ్యాలి.

చిన్న: వాళ్ళభాష మాలభాషే.

తండ్రి: ఆ అందుకే అదిమనం నేర్చుకోగూడదు.

పెద్ద: (తమ్ముడిలో) ఓయ్. ఇప్పుడు వాళ్ళే మనమెడమీద కూచుని పాలిస్తున్నారు. అది తెలియకుండా వుందినీకు.

చిన్న: ఔను. తురకలుపాలిస్తే మనంమేమి చేశాం. జాతివాళ్ళు పాలించినా అంతేచేస్తాం. ఎవడుపాలిస్తే మనకేమిటా?

పెద్ద: ఏమిటా? పాలించేవాళ్ళభాష నేర్చుకోవాలిమనం. వాళ్ళచదువు చదువుకోవాలి మనం.

తండ్రి: ఈ ఇంగ్లీషుచదువు వచ్చాక బొత్తిగా చెడిపోయిందిరా దేశం.

పెద్ద: ఇంగ్లీషుచదువువల్లే కాదూ నాలుగురాళ్ళు సంపాదించుకోడం. ఏ కుంపెనీలో దుబాసిగావున్నా ఏ కోర్టులో దుబాసిగాచేరినా నాలుగురాళ్లు సంపాదించుకోవచ్చు. ఇప్పుడు పారసీకం ఎవడికి కావాలయ్యా. అది రాజభాష అన్నమాటే గాని పొట్ట గడవడానికేమేనా పనికొస్తుందా? పొట్టగడవడానికి మళ్ళా ఇంగ్లీషే నేర్చుకోవాలి.

చిన్న: ఈ ఇంగ్లీషుచదువంతా రామమోహన్‌రాయి తెచ్చిపెట్టాడుట. నాన్నా అంతేనా?

తండ్రి: అంతే సహగమనం వద్దన్నాడు ఆ దొరగారే.

ఆ దొరగారే తెచ్చిపెట్టాడు ఇంగ్లీషుచదువు, గవర్నమెంటు వాళ్ళతో దెబ్బలాడి మరీని.

చిన్న: ఆడాళ్ళకీ అబ్రాహ్మణులకి చదువు లేక పోడంచేతే మనం చెడిపోతున్నాంట.

తండ్రి: ఏడిశాడులే! ఆయనగారికి విగ్రహారాధన పనికి రాదుట. ఏదో బ్రహ్మమతం మనమతంకంటే బాగుంటుందిట.

చిన్న: అంచేతే ఇంట్లోంచి తరిమేశారు. దేశాలంబట నాలుగేళ్ళపాటు తిరిగాడు. ఇంతకీ ఆయన కిరస్తానీ అయ్యా. ఆసంగతి ఎవరికీ తెలియదు.

పెద్ద: ఆయన కిరస్తానీలతో దెబ్బలాడుతూ వుంటేనే, మీ మతంప్రకారం మీరు నడుచుకోడంలేదని. ఆసంగతి నీకు తెలుసా? (తండ్రితో) ఏం నాన్నా?

తండ్రి: అదీ ఒక తమాషాయేరా. ఉత్తరదేశంలో వుండే కొన్నికొన్ని దురాచారాలు మాన్పించాడులే పాపం. శాక్తేయు లిచ్చే నరబలులు, వైష్ణవమతస్థుల ముఠాకోరుతనం, చంటి పిల్లల్ని చంపడం, బహుభార్యాత్వం మొదలైనవి. కాని సతి మాన్పించడం ఆడవాళ్ళనీ శూద్రుల్నీ చదువుకోమనడం, విగ్రహారాధన వద్దనడం, ఇటువంటివి ఎమిట్రా శుద్ధ తెలివి తక్కువతనంకాని. ఈ ఇంగ్లీషుచదువువచ్చాక దేశమంతా చెడిపోతూందిరా!

చిన్న: చూశావు నాన్నా ఇప్పుడంతా కొంతమంది పెద్దలు దొరవేషం వేస్తున్నారు, క్రాపింగు పెట్టించుకుంటున్నారు.

తండ్రి: కిరస్తానీమతంలో చేరిపోయారన్నమాటే. దొర వేషంవెయ్యడం, క్రాపింగు పెట్టించుకోడమంటే కిరస్తానీ మతంలో చేరిపోడమన్నమాటే. ఇంకేముంది నెత్తిమీది నీళ్ళు

చల్లించుకోడమేగా తరవాయి.

చిన్న: అంతేకాదు నాన్నా, వాళ్ళు ఇంగ్లీషు తెలుగు కలిపి మాట్లాడతారయ్యా. వాళ్లకి దేవుడూ దెయ్యమంటూ లేదుట.

పెద్ద: ఔనురా! తురకం తెలుగు కలిపి మాట్లాడేబదులు ఇంగ్లీషు తెలుగూ కలిపి మాట్లాడుతున్నారు. తప్పేముంది. తురకలు రాజయినప్పుడు తురకం తెలుగు కలిపి మాట్లాడారు. ఇంగ్లీషువాళ్ళు రాజులయినప్పుడు ఇంగ్లీషూ, తెలుగు కలిపి మాట్లాడుతున్నారు.

చిన్న: (తండ్రితో) ఈ మిషన్ బళ్ళన్నీ పోవాలయ్యా.

తండ్రి: నువ్వనేదేమిటి ఎవళ్ళూ వెళ్ళకపోతే నాటంతటవే పోతాయి.

చిన్న: మనవాళ్ళే వెళుతున్నారయ్యా మాకింగ్లీషునేర్పమని.

తండ్రి: మరి మీ బాబయ్యకొడుకుని తీసికెళ్ళి ప్రవేశ పెట్టాడు కదూ.

చిన్న: అదేమిటో మహాగొప్పగాచెప్పుగొచ్చాడు అన్నయ్య ......ఔనుగాని నాన్నా బ్రౌన్ దొరగారు చాలామందికి డబ్బిస్తున్నాడు టేమిటి? బ్రాహ్మలందరికీ సంభావన లిస్తున్నాడట.

తండ్రి: మంచిముండా వాడు పాపం పండితులనందరినీ దగ్గిరికిచేర్చి డబ్బిస్తున్నాడు.

చిన్న: ఎవడయ్యా ఇంకొడెవడో కైఫియత్తులన్నీ రాయిస్తున్నాడుట.

తండ్రి: మెకంజీదొర. ఏయే ప్రాంతాలవారిచరిత్ర ఆ యా ప్రాంతాలవారిచేత రాయించి జాగ్రత్తపెట్టిస్తున్నాడు.

చిన్న: ఇందులో స్వార్థమేమైనా వుందేమిటి?

తండ్రి: ఉండకేం ఏదో వుంటుంది.

పెద్ద: స్వార్థమేముంది? మన చరిత్ర మనకి తెలియచెయ్యడమే స్వార్థం. అంతకంటే మరేంలేదు.

తండ్రి: అంతేకాదురా. అంతకంటే మరేదో వుంటుంది. మనం చెప్పలేం కాని.

చిన్న: అన్నయ్య కిలాంటివన్నీ తెలియవు నాన్నా.

పెద్ద: ఏడిశావులే.

చిన్న: పోవోహ్. ఇంగ్లీషుచదువులో వుండే దగా నీకు తెలియదు.

పెద్ద: నీకు తెలుసులే మహా.

చిన్న: ఆఁ నిజమే.

పెద్ద: సంతోషించానులే.

తండ్రి: ఊరుకోండిరా దెబ్బలాడక.

---

# నూరేళ్లకిందట - సాహిత్యం.

'ఏం మామయ్యా! నా ప్రబంధం కాస్త సరిచూసి పెట్టవయ్యా! నీతో చెప్తానే ఉన్నాను. వీలుకలగచేసుకుని కాస్త చూసి పెట్టవయ్యా అని'

'ఏం పుస్తకంరా నువ్వనేది?'

'అప్పుడే మరుపా! ఆరి దీనమ్మకడువు కాలా! ఏడాదినుంచి చెప్తున్నాను కాదుటయ్యా!'

'నీకు రతనం పుస్తకంపేరు అట్టే వునశ్చరణ చేస్తున్నా ననుకున్నా వేమిటి!'

'మహాబాగా చెప్పావులే! ఎంతకురతనం, పుస్తకమైనా పేరేనా జ్ఞాపకముండవద్దా!'

'పేరు చెప్పరా అంటూంటే'

'ఇది నూటడెబ్బయ్యోసారి చెప్పడం!'

'అయినా చెబుదూ'

'మాకవిత్వం అంటే అంతనిర్లక్ష్యం అన్నమాట'

'ఇంకా ఎన్ని అంటావో అను. ఆతర్వాతే అడుగుతాను.'

'ఎన్ని అన్నా సరే, ఎప్పటికీ రే'

'... ... ... ... ...'

'ఎన్నిమార్లు చెప్పానయ్యా పోనీ'

'ఆతర్వాతె అడుగుతానన్నాగా'

'నేను చెప్పకపోతా నేమిటి!'

'చెప్పుమరి'

'చెప్తాడుంటేనే, 'కవిసార్వభౌమ మనోరంజనం'

'ఇంక అది చూసేదేమిటా?'

'కవిత్వసంగతి కాదయ్యా —'

'ఔను! అది నాకు తెలుసులే'

'మరి వ్యాకరణం తప్పులు. దాని తస్సాగొయ్యా, తిక్కన గారు రాసినా ఉంటూనే ఉంటాయి'

'ఔను'

'అవే కాస్త చూసిపెట్టుమని అడగడం, నూటికీ తొంబై తొమ్మిది ముప్పాతిక పాళ్ళు అవీ ఉండవు గాని,

'మిగిలిన రవ్వంతా ఉన్నా ఫర్వాలేదురా'

'నువ్వలా అంటావు. ఆపళంగా ఎవడో లంకించుకుంటాడు, కవిసార్వభౌమ మనోరంజన ఖండనం అని. దానికి మండనా

లతో అవస్థ పడాలి. నోరు నొక్కుకుపోతుంది.'

'అయితే ఎవడిలోనూ తప్పులుండ వంటావు. తప్పులు లేని కవిత్వం చూపించు పోనీ'

'అలాంటి పుస్తకమే లేదంటూంటే వినిపించుకో వేమిటి! తిక్కనంతటివాడిలోనే తప్పులుంటాయి. యజ్ఞంచేసి తిక్కన్న గారు వైదీకంగారాశాడు. మనది అచ్చవైదీక కవిత్వంలా ఉండ కూడదు మరి'

'ఎలాగుంటుందిరా నియోగిబిడ్డరచన'

'ఆమాటనిజమే. ఒకవైదీకి కవిమీద కత్తి నూరుతున్నా'

'ఛీ! ఛండాలపుపని. ఎవడు చెప్పాడురా నీకది. అంతకంటే తెలివితక్కువపని ఉంటుందా! కాలహరణాని కంతకంటే పనికి మాలిన పనిఉండదు.'

'ఎంచేత?'

'ఎంచేతంటా వేమిట్రా పైగా'

'అయినా చెబుదూ'

'కవిత్వంరాస్తే (మీసంవడేసి) రాయాలికాని, వైదీకపాడు ఏంరాస్తాడురా!'

'ఆసంగతి వాళ్ళకే తెలుసు, మనకి వేరే చెప్పక్కర్లేదు'

'అయితే ఎందుకురాస్తున్నావు మరి?'

'ఏడిపించడానికి'

'అయితే బాగానే ఉందికాని, ఏంతప్పులు చూపిస్తున్నావు?'

'పుస్తకంలో ఏం తప్పులుంటాయి!'

'వ్యాకరణమేనా!'

'అంతకంటే మరొకతప్పంటూ ఉంటుందేమిటి!'

'నిజమే!'

'అంచేత నా పుస్తకం కాస్తచూసి పెట్టవయ్యా అనడం. అడుగుతూన్న కొద్దీ బిగుస్తూన్నావు నువ్వు.'

'వేళచూసుకోవద్దురా'

'వేళ కుదురుతుందని ఎప్పుడుఅంటావు'

'మనం ఎన్నిచూచినా వ్యాకరణం తప్పులు ఉండకుండా ఉండవురా! వ్యాకరణమంటే మహాసముద్రం. ఎవడితరం కాదురా దాన్ని ఈదడం. ఏదితప్పో ఏదిఒప్పో దృఢంగా చెప్ప డానికి ఎవ్వడితరమూ కాదు. నోరు విప్పేటప్పటికి ఇంకో కవి ప్రయోగం కనబడుతుంది, వీడిది తప్పంటూ'

'అయినా మనకి చేతయినంతమట్టుగు'

'అలాగేలే'

'మామయ్యా! ఈకాలంలో గొప్పకవి అంటూ ఒక్కడూ లేడేమిటయ్యా! అంతానా – నీతర్వాతే'

'ఏదో ముగ్గురునలుగు రున్నారుకాని'

'ఎవరెవ రంటావు'

'అక్కినపల్లి నృసింహకవి, గోపాలుని రామకవి, పైడిపాటి వెంకటకృష్ణకవి, కొటికలపూడి వెంకటకృష్ణకవి'

'వైదీక పాళ్ళపేర్లుకూడా చెప్తున్నావు'

'లోకం చెప్పుకుంటూన్న పేర్లు చెప్తున్నానురా'

'సరే ఫర్వాలేదు అయితే'

'వీళ్ళ కవిత్వమయినా—'

'నీకవిత్వంతో సాటిరాదు. మరినాపుస్తకం చూశావు కాదు'

'అబ్బాయీ! కవిత్వానికంతా ఒక్కటే ఆదర్శముంది'

'ఏమిటది?'

'పిల్లవసుచరిత్రల్ని మించిన పెద్దవసుచరిత్ర అవాలి. లేక పోతే కూచిమంచి తిమ్మన్ననిమించి రాయాలి'

'మరినాది'—

'పిల్లవసుచరిత్రలంటే మనవైపు అర్థం అబ్బయామాత్యుడి 'కవిరాజమనోరంజనం,' అడిదం సూరకవి 'కవిజనరంజనం'; తిమ్మన్న పుస్తకాలని గురించీ వేరే చెప్పక్కర్లేదుకదా !'

'మరి మనది'

'వీటిని మించిన కవిత్వంగా ఉండాలి'

'నీకవిత్వం అంటూంటేనే'

'శ్లేష, గర్భ, బంధకవిత్వాలు ఎంతవిస్తారంగా ఉంటే అంత రసవంతంగా ఉంటుంది కవిత్వం'

'అది అందరూ ఎరిగున్న సంగతే. నీకవిత్వం అందులో ఆరి తేరిందయ్యా !'

'ఒకంతటవచ్చిందిట్రా పాకం'

'నాపుస్తకం కాస్త చూశావుకాదు'

'ఇదే ఆదర్శంగా పెట్టుకుని రాయాలి'

'అలాగేకాని ఔనుగానిమామయ్యా ! ఊళ్ళో అయుదుగురు దేవుళ్ళమీదా అయిదు శతకాలు రాశానయ్యా, నూకాలమ్మా, చామలమ్మాకూడా కలిపి. ఏమిటి ! అయిదూ అయిదురకాల వృత్తాలు. మహాభేషుగ్గా ఉంటాయిలే'

'నేను ఇప్పటికి ఇరవైశతకాలు రాశానురా, చెప్పినవృత్తంలో చెప్పకుండా'

'ఎవడోగాని ఏభైశతకాలుకూడా రాశాడుటయ్యా'

'ఏభైఓలెక్కట్రా, నూరు శతకాలు రాయదలచుకొన్నా నేను'

‘ పేరు బాగాకుదురుతుందయ్యా, శతశతక కర్త అని, మహా గమత్తుగా ఉందిలే’

‘ ఇప్పుడో గ్రంథం తయారు చేస్తున్నా’

‘శతకమే’

‘ కాదురా, పూర్తిగా వినుమరి. వల్లభా పరిణయమనే విఘ్నేశ్వరుడి పెళ్ళికథ ’

‘ వెనకెవడో రాసినట్టున్నాడయ్యా’

‘ రాయందిఏదిరా! ఏది వెనకరాయంది! కవిత్వానికి కథ ముఖ్యంకాదుగా. కథలంకరి వీవాళ్ళకే. ఏటొచ్చీ శబ్దచమత్కృతే లేదా ’

‘ దాని తస్సాగొయ్యా వాడిదే శబ్దచమత్కృతి అంటే. వాడితర్వాతే అందరికవిత్వమూ. ఒక్క అక్షరంలో పద్యమంతా చెప్పాడు. దానిని మించిన కవిత్వముందా ! ’

‘ ఏదీచదువు మరోమాటువిందాం ’

‘ క. కైకోకీకాకకుకై
కోకాకాకింకకూకికూకకుకోకి
కాకుకకుకేకికేకిక
కూకోకౌకుక్కకకింకకోకైకౌకా *

నంది మల్లయ్యా, ఘంటసింగన్నల పద్యమింకా ద్వ్యక్షరమే’

‘ వెంకటకవిపద్యంలో ఇంకా ‘న’ కారం తప్పిందికాదు ! నేను రాసినపద్యం విన్నావుకాదు, సగమయింది ’

‘ దేనితో ’

‘ ల ’ ఏకాక్షరం ’

‘ అచ్చా ! ’

* గణపతి వెంకటకవి రచించిన “ప్రబంధ రాజ వేంకటేశ్వరవిజయవిలాసం” లోది.

'కవిత్వమంటే ఒకంతటవుతుందట్రా. నిఘంటువులు విరిగి పోతున్నాయి.'

'మనమూ అలాంటివే ఓ నాలుగుపుంజీలు రాయదలచుకొన్నాం'

'మంచిదే'

'ఎవడికయ్యా అంకితమిస్తావు నీగ్రంధం. నరాంకితమా, దైవాంకితమా ?'

'నరాంకితాలు రెండు అయాయికదుట్రా. ఒకటి వాసిరెడ్డి వారికి, ఒకటి కోటరామచంద్రపురంవారికీ. రెండిటికి రెండు అగ్రహారాలు ఊడిపడ్డాయి. తక్కినవి దైవాంకితాలు'

'ఇదేంచేస్తావు ?'

'ఏమో చెప్పలేను'

'ఔనుగాని దేవుడెలాగ అడుగుతాడయ్యా పుస్తకం అంకితమియ్యమని. వట్టిఅబద్ధమేనా?'

'మనిషి అడగడంకంటే సులువుగా అడుగుతాడు'

'ఏమిటీ?'

'నేను మూడుగ్రంధాలు దైవాంకితాలే చేశానుకదూ'

'ఎలాగా అని?'

'పగలల్లా దాన్నిగురించే ఆలోచించడం'

'ఊ?'

'టక్కున ఎప్పుడో ఒకప్పుడు రాత్రి కలలో చక్కా వస్తుంది'

'ఎలాగయ్యా'

'పగలు తలచుకొన్నవి రాత్రి కలలో రావడంలేదుట్రా'

'ఔను'

'అంతే ఇది కూడా'

'అరి దీని తస్సాగొయ్యా! ఇంతసుళువుటయ్యా! ఏదో బ్రహ్మాండ మంతపని అనుకున్నాను. అరి!'

'లేకపోతే ఎలాగిచ్చాననుకున్నావు, మూడు ప్రబంధాలూ కూడా దేవుళ్లకి'

'ఇంకెందుకూ, బోధపడిందికా, అయితే నేనుకూడా రెండు మూడు దైవాంకితాలు జరుపుతా'

'ఊఁ. కానీ'

'వెంకమ్మపని చాలాజోరుగా ఉందయ్యా'

'ఏ వెంకమ్మా?'

'ఏ వెంకమ్మ అంటావేమిటి, తరిగొండ వెంకమ్మ'

'ఏం, ఏంజోరుగా ఉంది'

'చాల కథలు చెప్పుకుంటున్నారు'

'ఊఁ'

'పేరు వితంతువే అని'

'అలాంటివి చాలాచాలా చెప్పుకుంటారులే. ఆడదయితే చాలు కమ్మలు కట్టడానికి. అందులో చదువుకున్నది. ఇంకేం కావాలి. కాకులు పొడిచినట్టుగా పొడిచేస్తారు లోకులు'

'అన్నీ అబద్ధాలే అంటావు'

'సందేహ మెందుకు?'

'పోనీగాని ఇది విన్నావూ?'

'బూతేనా?'

'బూతైతే చెప్తానా!'

'అబద్ధంబూతులు వినకూడదులే'

'ఇదయ్యా! వెంకమ్మని జుట్టు తీయించేసుకో మన్నాడుట

ఓస్వాములారు'

'అలాగే తీయించుకుంటాను గాని ఒక్క ఉపకారం తిరిగి చేసిపెడుదూ అని ఆస్వాము లారిని అడిగిందిట'

'ఉఁ'

'మళ్ళీ వెంట్రుకలు రాకుండా చెయ్యి, మళ్ళీమళ్ళీ వస్తూంటే తీయించుకుని ప్రయోజనమేముంది అందిట'

'బుద్ధొచ్చిందా స్వాములారికి'

'రాక, నెత్తినిగుడ్డవేసుకు అదేపరుగు'

'కవయిత్రి దగ్గరా సన్యాసిఆటలు'

'మరే. ఆవిడకవిత్వంలో చాలావేందాంతముంటుందిసుమా'

'దొంగవేదాంతం కాదురా, మనసులో పుట్టుకొచ్చిన వేదాంతం. స్వచ్ఛమైన మనిషి చాలామంచిది. ఆవిడరాసిన ద్విపదభాగవతం పోతన్నదానికంటె ఎంతో బాగుంటుంది'

'అలాగటయ్యా !'

'ఔనుగాని మామా ! పింగళి ఎల్లన్న కిరస్తానీపుస్తకం రాశాడుటేమిటి ?'

'డబ్బుకోసం రాశాడురా, ఏదైనా పురుషోత్తమచౌదరికన్న కంటేనయం'

'ఏం, ఎంచేత ?'

'మతంపుచ్చు కున్నాడువాడు'

'అయ్యయ్యో ! పాపం ! ఏమేంరాశా డేమిటి ?'

'చక్కనిశతకం మొకటి; పేరు దశరథరామ శతకం. తర్వాత ప్రబంధం ఒకటిమంచిది, నీలాచలవిలాసమని'

'ఏమేనా డబ్బొచ్చిందా మతం పుచ్చుకున్నాక'

'చేరేవరకూనే ఆశపెట్టడం'

'చేరేక'

'చేరేక చచ్చినట్టు పడిఉండడమే. డబ్బూలేదు దసకంలేదు. వెనక్కిరావడానికి దారిలేదు.'

'ఇంతకీ డబ్బంటే అలా పడిచావడ మెందుకూ!'

'అందుకనే అలా అనుభవించడం'

'ముండాకొడుక్కి మంచిపని అయిందిలే ఇలాంటిపని బ్రౌను దొరకూడా చేస్తున్నాడు'

'ఛా! ఛా! చాలామంచివాడురా పాపం. పండితుల్ని చేరదీసి చెయ్యగలిస్తే ఉపకారంచేస్తున్నాడు, లేకపోతే ఊరుకుంటున్నాడు'

'మంచివాడే పాపం'

'ఇంతాఅంతానా?'

'అవునిగాని ఏమయ్యా! వాక్యగ్రంధాలు తెగ బయలుదేరుతున్నాయేమిటి!'

'వచనంమాటేనా నువ్వు చెప్పటం?'

'ఊఁ'

'దానిమాట చెప్పకురా'

'ఏం?'

'ఒక్కపుస్తకం వచనంలో రాయడంకంటే పదిపుస్తకాలు పద్యంలో రాసుకోడం సులువు'

'ఏమిటీ!'

'అంతసులువు'

'నిజంగా!'

'నిజంగానే. అంచేతే మనం ఊరుకోడం'

'ఎంచేతయ్యా ?'

'నిఘంటువులు మూలపడతాయి, వచనం రాయడమొస్తే, మాట్లాడేమాటల్లో రాయాలి. నీ చిత్రకవిత్వం, బంధకవిత్వం, గర్భకవిత్వం గంగలో కలిసిపోతాయి'

'నిజమే',

'కాకపోతే అంచేతే తాటాకుమీద గంటంపెట్టలేం వచనం పేరుచెప్పి'

'ఏమిటీ !'

'అందుకనే మానెయ్యడం'

'సరిసరి. కాని వచనంలో మట్టుగు మహామంచిపుస్తకాలు బయలుదేరాయి సుమా, చదువుతూంటే పద్యగ్రంథాలెందుకూ పనికిరావనిపిస్తున్నాయి.'

'ఔను ! నిజమే !'

'అలాంటి పుస్తకాలున్నాయి. అది ముచ్చటగా ఉంటుంది చదివితే'

'బహుకష్టం రాయడం మట్టుగు'

'దాంట్లోకూడా దిగి చూద్దాం'

'అనుభవిస్తావు, దోవ తెలియదు'

'చూద్దాంగా'

'చూసే దేమీలేదు, రాసే దంతకన్నా లేదు'

'చూద్దాంగా'

'చెప్పానుగా'

'తప్పదు రాయడం'

'నీఖర్మం'

---